# మిసిమి

*"All that we are is the product of what we have thought,"*
*is "We are what we think."* – **Dammapada.**

సంపుటి 2 జనవరి 1992 సంచిక 30

## విషయసూచిక



వార్షిక చందా రూ.40/-

Printed, Published and Edited by Shri ALAPATI RAVINDRANATH for and at Kala Jyothi Process Pvt. Ltd., 1-1-60/5, Ifterkar Mansion Lane, R.T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 612436, 612337.

**Editorial NEST**
B-15, Journalist Colony, Jubilee Hills, Hyderabad-500 034. Ph. 247717

# LIVING DICTIONARY
## (DEVIL'S DICTIONARY)

*Compiled by*
AMBROSE BIERCE (1911)

**Abrupt,** *adj.* Sudden, without ceremony, like the arrival of a cannon-shot and the departure of the soldier whose interests are most affected by it. Dr. Samuel Johnson beautifully said of another author's ideas that they were "concatenated without abruption."

**Abscond,** *v.i.* To "move in a mysterious way," commonly with the property of another.

**Absent,** *adj.* Peculiarly exposed to the tooth of detraction; vilified; hopelessly in the wrong; superseded in the consideration and affection of another.

**Absurdity,** *n.* A statement of belief manifestly inconsistent with one's own opinion.

**Academe,** *n.* An ancient school where morality and philosophy were taught.

**Accident,** *n.* An inevitable occurrence due to the action of immutable natural laws.

**Accountability,** *n.* The mother of caution.

**Accuse,** *v.t.* To affirm another's guilt or unworth; most commonly as a justification of ourselves for having wronged him.

**Achievement,** *n.* The death of endeavor and the birth of disgust.

**Acknowledge,** *v.t.* To confess. Acknowledgment of one another's faults is the highest duty imposed by our love of truth.

**Acquaintance,** *n.* A person whom we know well enough to borrow from, but not well enough to lend to. A degree of friendship called slight when its object is poor or obscure, and intimate when he is rich or famous.

**Actually,** *adv.* Perhaps; possibly.

**Administration,** *n* An ingenious abstraction in politics, designed to receive the kicks and cuffs due to the premier or president. A man of straw, proof against bad-egging and dead-catting.

**Admiration,** *n.* Our polite recognition of another's resemblance to ourselves.

**Admonition,** *n.* Gentle reproof, as with a meat-axe. Friendly warning.

**Age,** *n.* That period of life in which we compound for the vices that we still cherish by reviling those that we have no longer the enterprise to commit.

# తాత్విక త్రిమూర్తులు సోక్రటీస్-ప్లేటో-అరిస్టాటిల్

- ఎన్. ఇన్నయ్య
పి.హెచ్.డి.,

ప్రపంచమంతటా పచ్చి మాంసం పీక్కుతినే రోజుల్లో అక్కడక్కడా, ఎడారిలో నీటిమడుగులవలె నాగరికత విలసిల్లింది. ఇండియా, మెసపొటోమియా, ఈజిప్టు, చైనాలలో ఆలోచన ముందుకు నడిపించింది. కాని గ్రీసులో మేధస్సు యింకా ముందుకుసాగి, స్వతంత్ర ఆలోచన, కార్యాచరణ సంబంధంతో వుండడం ఆశ్చర్యకరం. వారు ప్రకృతిలోనే అన్వేషణ సాగించారు. తత్వం థేల్స్‌తో ఆరంభమై ప్రతిదానికీ మూలకారణం కోసం ప్రకృతిలోనే చూశారు. అనాగ్సగొరాస్, లూకిపోస్, డెమొక్రొటిస్, ఎంపిడోక్లిస్, క్సెనోఫెన్స్, పైథాగొరస్, హెరాక్లిటస్, ప్రొటాగొరస్, యింకా అణువాదులు బయలుదేరారు. ఆశ్చర్యకరం ఏమంటే, బానిసత్వం ఒకవైపున వుంటుండగా, మిగిలిన సమాజంలో ప్రజాస్వామ్యం అమలు జరిగింది. అందులో ఏథెన్స్ నగరం కీలక పాత్ర వహించింది. కళలు, సంస్కృతి, డ్రామా, శిల్ప సంపద వచ్చాయి. సముద్ర ప్రయాణాలు సాగాయి. సోఫోక్లిస్, యూరిపిడిస్, ఈస్కలిస్ వంటి నాటకకర్తలు డ్రామాకు ఆద్యులు. రాచరికాన్ని కోరిన స్పార్టాకు భిన్నంగా, ఏథెన్స్ ప్రజాస్వామ్యం కోసం నిలబడింది.

అలాంటి వాతావరణంలో సోక్రటీస్ బయలుదేరి, గ్రీకు దేవుళ్ళను వెక్కిరించాడు. నీతి కోసం ప్రచారం చేశాడు. రాజులు ఆరాధించే దేవుళ్ళను వ్యంగ్యంగా విమర్శించినందుకు సోక్రటీస్‌ను ద్రోహిగా చిత్రించారు. 500 మంది కూర్చొని యువతను చెడగొడుతున్నారని, విచారణ జరిపారు. చివరకు 60 మంది అధిక సంఖ్యతో, సోక్రటీస్‌కు విషం యివ్వాలన్నారు.

సోక్రటీస్ తన పక్షాన తానే వాదించుకున్నాడు. పారిపోయే అవకాశం వున్నా, స్నేహితులు ప్రోత్సహిస్తున్నా వినకుండా, విషం పుచ్చుకుని చనిపోయాడు. జీవితమంతా సంభాషణలతో ఎందరో శిష్యుల్ని తయారుచేశాడు. భార్య ముగ్గురు పిల్లల కోసం ఏమీ చేయలేదు. ఆమె కష్టపడి కుటుంబాన్ని పోషించింది. సోక్రటీస్ వాదించే పద్ధతి శాశ్వతంగా చరిత్రలో నిలచిపోయింది.

అడిగేవాడికి చెప్పేవాడు లోకువ అంటారు గదా. చెప్పేవాడికి అడిగేవాడూ లోకువే అని గతితార్కికంగా చూపించాడు సోక్రటీస్. పగలు చూస్తే రాత్రి కలలోకి వచ్చేట్లు వుంటాడు. అలాంటి కురూపి మస్తిష్కం నుండి ఎంతో నిశిత భావ పరంపర వెలువడింది. కలం పట్టని, రాయని భాస్కరుడు సోక్రటీస్. సోక్రటీస్‌కు రాసే అలవాటు లేదు. అయినా ఆయన భావాల బలం నేటికీ చర్చనీయాంశాలుగా ప్రపంచంలో నిలిచాయి. 70 సంవత్సరాలు బ్రతికిన సోక్రటీస్ నాటి ఏథెన్స్ నగర పాలకులకు ప్రమాదకరంగా కనిపించాడు. యువత

చెడిపోతున్నదని భయపడి, విషం యిచ్చారు. తాగకుండా పారిపోయే అవకాశం వున్నా, చివరి నిమిషం వరకూ చర్చలు సాగించి, స్వయంగా విషం పుచ్చుకొని చనిపోయిన సోక్రటీస్‌కు, ప్లేటో శిష్యుడుగా లభించడం పెద్ద మలుపు. లేకుంటే ఆయన భావాలు మనకు తెలిసే అవకాశం వుండేది కాదు. ప్లేటో జ్ఞాపకం పెట్టుకొని, సోక్రటీస్ చర్చల్ని మనకు అందజేశాడు.

సోక్రటీస్ (క్రీ.పూ. 469-399) ఏథెన్స్ నగరంలో నాడు సుపరిచితుడు. ఆయన్ను వెక్కిరిస్తూ నాటకాలు వేసిన వారున్నారు. శిష్యులతో చర్చలు సాగించిన సోక్రటీస్, ఒక్కొక్కసారి హఠాత్తుగా ఆగిపోయి అంతా మరచిపోయినట్లుండేవాడు. ఎప్పుడో ఒకసారి తాగేవాడు. (మద్యం)

వినయంగా తనకు ఏమీ తెలియదని సోక్రటీస్ అన్నా, తెలుసుకోవడమే మనిషి కర్తవ్యం అని అతడి చర్చల సారాంశం. తెలియకపోవడమే దోషమనీ, తెలుసుకుంటే తప్పు చేయడనీ, సోక్రటీస్ అభిప్రాయం. ఏది మంచి అని గ్రహించడానికి తెలుసుకోవాలి. మంచి అనేదే జ్ఞానమన్న మాట. ఇది సోక్రటీస్ విశిష్ట ధోరణి.

ప్లేటో రాసిన తొలి సంభాషణలన్నీ (డైలాగ్స్) సోక్రటీస్ భావాలే. తాత్వికంగా ఆలోచించి, నైతిక భావాల్ని విడమరచి చెప్పిన సోక్రటీస్ వీటిల్లో మనకు కొట్టొచ్చినట్లు కనిపిస్తాడు. సోక్రటీస్ అనుసరించిన సంభాషణ విధానం, అంతకు ముందే జీనో ప్రారంభించాడు. కాని ప్లేటో చేతిలో సోక్రటీస్ డైలాగులు జీవం పోసుకున్నాయి.

సోక్రటీస్ ధోరణిలో స్పష్టంగా కనిపించేది - స్వయంగా ఆలోచించు అని. పదే పదే దీనినే ప్రోత్సహించాడు. సోక్రటీస్ వ్యంగ్య ధోరణి ఎదుటివారిని దెబ్బ తీసేది. ఆయనలో హాస్యం లేదు. సమకాలీన తాత్విక చింతన స్పష్టంగా అవగాహన చేసుకున్న సోక్రటీస్, మన అజ్ఞానం అపారం అని గ్రహించేట్లు చేశాడు.

మనకు బాగా తెలుసు అనుకున్న భావాలతో సోక్రటీస్ చర్చను ప్రారంభించి, వాటి వెనుక ఎంతో జటిలమైన విషయాలు యిమిడి వున్నాయని చూపేవాడు. ప్రశ్నలకు సమాధానం చెప్పడం ముఖ్యం కాదు. విషయాన్ని అవగాహన చేసుకోవడం అవసరం. ఇలాంటి చర్చల సారాంశం చూస్తే, మంచివాడికి ఎన్నడూ హాని జరగదని, న్యాయం వలన మంచి జరుగుతుందని సోక్రటీస్ పేర్కొన్నాడు. డబ్బు పోగొట్టుకోవడం, జబ్బుతో ఆరోగ్యం కోల్పోవడం అనేవి హాని చేకూర్చినట్లు కాదు. నీకు నీవు చేసుకునే హాని, అక్రమ జీవనం గడిపి, ఆత్మకు చేసుకునే నష్టం ముఖ్యం అని ఆయన ఉద్దేశం. ఆత్మకు హాని జరగనంతవరకూ ప్రపంచం నిన్నేమీ చేయలేదని, పైపైన జరిగినట్లనిపించే నష్టాలు ముఖ్యం కాదనీ అన్నాడు. ధర్మమే జ్ఞానం అని కూడా సోక్రటీస్ స్పష్టీకరించాడు. అజ్ఞానం వలన తప్పులు చేస్తామని, అలా చేయడం స్వచ్ఛందంగా చేసినట్లు అనుకోరాదన్నాడు. కావాలని ఎవరూ తప్పు చేయరని ఆయన అంటాడు. ఇదంతా ఆనాటి పరిస్థితుల్లో సోక్రటీస్ ఎదురీతకు నిదర్శనం.

ఏథెన్స్ రాజ్య పాలకులకు కంటకంగా కనిపించిన సోక్రటీస్‌ను, 70వ ఏట చంపేయాలనుకొని, విచారణ జరిపి, దోషిగా నిర్ధారించారు. సోక్రటీస్ సొంత దేవుళ్ళను సృష్టించాడన్నారు.

చావుకు భయపడనక్కరలేదని తన శిష్యులకు చెప్పిన సోక్రటీస్ ఆఖరి క్షణాల వరకూ అమరత్వం గురించి చర్చలు సాగించాడు. ఒక నెల రోజులు జైలులో గడిపిన సోక్రటీస్, చనిపోయిన అనంతరం కూడా చాలా ప్రభావం కనబరచాడు. ప్లేటో వయస్సు అప్పటికి 31. గురువుగారి సంభాషణలు గ్రంథస్థం చేశాడు. The Apology, The Crito, The Euthyphra, The Laches, The Charmides, The Protagorus, The Gorgies అనే ప్లేటో తొలి రచనలన్నీ సోక్రటీస్ భావ పరంపరలే.

సోక్రటీస్ అభిప్రాయాల ప్రకారం అధికార కీలక స్థానాల్లోకి సమర్థులైన వ్యక్తులు రావడం అవసరం. ఆయన చింతన యావత్తూ నైతిక పరంగానే కొనసాగింది.

క్రీ.పూ. 6వ శతాబ్దిలోనే గ్రీసు దీవులలో థేల్స్ తొలి తత్వవేత్తగా ఆలోచన ప్రారంభించాడు. ఆతరువాత అనాగ్జిమాండర్, పైథాగొరాస్, పామినైడ్స్, హెరాక్లిటస్, ఎంపిడోక్లిస్, అనాగ్జగొరాస్, అణువాదులు, ప్రొటాగొరస్, అద్భుతమైన ఆలోచనా స్రవంతిని ప్రకటించారు. వారెవరికీ రాని పేరు ప్రఖ్యాతులు సోక్రటీస్‌కు వచ్చాయి. సోక్రటీస్ పద్ధతి అనే నానుడి ఏర్పడింది.

## ప్లేటో (క్రీ.పూ. 427-347)

''ఇవన్నీ నీకు ఎలా జ్ఞాపకం వుంటాయని'' సుప్రసిద్ధ ఆర్థికవేత్త గాల్‌బ్రత్‌ను ఎవరో అడిగారట. నాకు ఏనుగులంత జ్ఞాపకశక్తి వుంది. ఆ మాటకొస్తే ఒక్కొసారి ఏనుగులే స్వయంగా వచ్చి నన్ను సంప్రదిస్తుంటాయి అన్నాడట. ప్లేటో జ్ఞాపకశక్తికి యిది అన్వయించవచ్చు. 81 సంవత్సరాలు బ్రతికిన ప్లేటో ఏథెన్స్‌లో అకాడమీ స్థాపించి, తన గురువు సంభాషణలు రాయడమేగాక, క్రమేణా తన ఆలోచనలు అద్భుత శైలిలో ఆకర్షణీయంగా అందించాడు. సోక్రటీస్ విషం తాగి చనిపోయిన వెంటనే ఏథెన్స్ విడిచి మెగారాకు పారిపోయి తల దాచుకొని, సద్దుమణిగిన తరువాత క్రీ.పూ. 387లో ఏథెన్స్ వచ్చి ప్లేటో తన ప్రభావం చూపెట్టాడు. తన అకాడమీలో చేరదలచిన వారికి తప్పనిసరిగా గణితం రావాలని ప్లేటో పట్టుబట్టాడు. శాస్త్రీయంగా ఆలోచించే ధోరణికి నాంది పలికిన ప్లేటో సమకాలీన భౌతికవాదాన్ని వ్యతిరేకించాడు.

ప్లేటో రచనలన్నీ సంభాషణల రూపంలో వున్నాయి. 20 పేజీల మొదలు 300 పుటల వరకూ గల యీ రచనలు 24 వరకూ లభించాయి. వీటిని మూడు రకాలుగా వర్గీకరించి, తొలి రచనలు సోక్రటీస్ భావాలుగా నిర్ధారించారు. తరువాతవన్నీ ప్లేటో వాదనలే. రిపబ్లిక్, సింపోజియం అతి ప్రధాన రచనలుగా తాత్వికులు పరిగణిస్తున్నారు. సోక్రటీస్ సంభాషణల ప్రభావం నుండి క్రమేణా ప్లేటో తన భావాలను పెంపొందించాడు. సోక్రటీస్‌ను ప్రధాన పాత్రగా చూపుతూనే ప్లేటో తన తత్వాన్ని, నైతిక చింతనను ప్రవేశపెట్టాడు. స్వయంగా ఆలోచించి ప్రశ్నలకు సమాధానాలు రాబట్టాలని ప్లేటో ఉద్దేశం.దేన్నీ గురించైనా నిర్ధారణగా చెప్పనక్కరలేదు. మన నమ్మకాలు, వూహాలు ఎప్పుడూ ప్రశ్నించుకుంటూ పోవాలి. ఇదే సోక్రటీస్ పద్ధతి.

ప్లేటో దృష్టిలో ఆత్మకు జ్ఞానం వుంటుంది. అంటే మన మనస్సు కంప్యూటర్ వంటిది.

మనం నేర్చుకోవడమంటే, అంతకుముందే వున్నవాటిని జ్ఞాపకం చేసుకోవడమే.

ప్లేటో రచనల్లో రిపబ్లిక్ ప్రాముఖ్యతను సంతరించుకున్నది. ప్రతి ప్రశ్నకూ ఇంకో ప్రశ్నతో సంబంధం వున్నదనీ, యీ అన్వేషణ నిరంతరంగా కొనసాగుతుందనీ ప్లేటో ఉద్దేశం.

పరిపాలకులు తత్వవేత్తలుగా వుండాలని భావించిన ప్లేటో, ప్రజల్ని మూడు విధాలుగా వర్గీకరించాడు. సామాన్య జనం, సైనికులు, సంరక్షకులు అనే విభజనలో, సంరక్షణ చేసేవారిని తొలుత శాసనసభ ఎంపిక ద్వారా తీసుక రావాలన్నాడు. అలా ఒకసారి ఎన్నికైన తరువాత వంశపారంపర్యత పాటించాలి. ప్లేటో తన ఆదర్శ రాజ్యం గురించి చాలా వివరంగా వర్ణించాడు. ఉన్నత సంరక్షకులలో అనర్హులైన పిల్లల్ని తొలగించవచ్చనీ, తక్కువ వర్గాలలో ఎవరైనా అర్హులైతే వారిని ప్రోత్సహించి పైకి తీసుకరావచ్చనీ అన్నాడు. ప్లేటో తన ఆదర్శ రాజ్యాన్ని కేవలం వూహగా భావించక, అమలు పరచాలనే అనుకున్నాడు.

ప్లేటో దృష్టిలో భావాలు రెండు రకాలు. ఒకటి విశ్వజనీనం. అది నిజం. ఉదాహరణకు అత్త అనే భావన విశ్వజనీనమైంది. ఇది అందరి అత్తలకు చెందుతుంది. దీనినుండి విడివిడిగా రాబట్టి, వ్యక్తిగతంగా ఒక అత్తకు అన్వయించే భావన, మన అనుభవంలోకి వచ్చేదన్న మాట. కాని ఇలా విడిగా వ్యక్తి పరంగా చూచే అత్త కనిపించే రూపం మాత్రమే అని, విశ్వవ్యాప్తంగా వుండే అత్తదనం వాస్తవమని ప్లేటో వాదించాడు.

మారని విశ్వం గురించి హేతువు, వివేచన ద్వారా గ్రహిస్తాం. మారే ప్రపంచం గురించి తెలుసుకునేదంతా మన భావనే. దేవుడు ప్రపంచాన్ని క్రమబద్ధంగా ఏర్పరచాడు. ఆత్మ, శరీరం కూడా రూపొందించాడు. విశ్వంలో భూమి, గాలి, నిప్పు, నీరు అనే నాలుగు భూతాలున్నవి. మనం చూచేదంతా శాశ్వత తత్వ నమూనాలే. ఇది ప్లేటో దృష్టి. పాశ్చాత్య ప్రపంచంలో యీ దృష్టి చాలా కాలం ప్రభావాన్ని చూపెట్టింది. జ్ఞానం అంటే ఏమిటి అనే అంశం కూడా ప్లేటో విపులంగా చర్చించాడు.

ప్లేటోతో రాజీపడకుండా, ఆయన ప్రస్తావించిన అంశాలు పరిష్కరించకుండా తత్వంలో ముందుకు సాగిపోలేమని భావించిన వారున్నారు. ప్లేటో తరువాత వచ్చిన తత్వమంతా, కేవలం మౌలిక అంశాల విపులీకరణ మాత్రమేనని తలపోసిన వారూ లేకపోలేదు. మొత్తంమీద పునర్వికాసం పైనా ఆ తరువాత ప్లేటో తాత్విక ప్రభావం వున్న మాట కాదనలేం.

## ప్లేటో సారాంశం

తత్వ శాస్త్రంలో ప్లేటో భావాలకు వచ్చిన ప్రచారం, వాటి ప్రభావం దృష్ట్యా, నిగ్గు తేల్చి అవేమిటో చూద్దాం:

ప్లేటో ఆదర్శ రాజ్యాన్ని వూహించాడు. రాజ్యంలో పాలకులు సంరక్షకులు. వీరు వివేచనాత్మకులు. వీరికి దైనందిన పాలనలో సైనికులు తోడ్పడతారు. సంరక్షకులు వివేచనతో పరిపాలించడానికి తగిన విద్య అవసరం. సరైన విద్యను బాల్యదశ నుండే సంరక్షకులకు నేర్పాలి. వ్యాయామం, విజ్ఞానం, తత్వం నేర్చి పాలకులుగా వీరు ఆరి తేరాలి. అలాంటి

వారినే ప్లేటో రాజ్యపాలనా తాత్వికులు అన్నాడు. రాజకీయ వేత్తలు, తాత్వికులు మిళితం గావడం అవసరమని సక్రమ పాలనకు యీ సమ్మిశ్రితం తోడ్పడుతుందని ప్లేటో నమ్మాడు. సంరక్షకులుగా రాజ్యపాలన చేసేవారికి సంసార లంపటత్వ భారం వుండరాదు. వారి పిల్లల్ని వేరుగా పెంచాలి. సంరక్షకులు పెళ్ళి పెటాకులు అని సంసారాలికి కట్టుబడి వుండరాదు. పాలకుల స్థాయిలో ఉత్తమ స్త్రీలతో లైంగిక సంబంధాలు వుంటాయి. ఆస్తిపాస్తులు కూడా అందరికీ చెందుతాయి. అలా వున్న రాజ్యంలో మాత్రమే పాలకులు పాలనా వ్యవహారాలను సంపూర్ణంగా పట్టించుకో గలుగుతారు. పాలకులకు పుట్టిన పిల్లల్లో అనారోగ్యంగా ఎవరైనా వుంటే అటువంటివారు క్రమేణా క్షీణించి చనిపోయేట్లు చేయాలి తప్ప, వికలాంగులుగా పెంచరాదు. ఉత్తమ సంతానం రాజ్య పాలకులకు అవసరం.

**రామణీయకత ఆవశ్యకతను గుర్తించిన ప్లేటో, సంగీత ప్రియత్వాన్ని వెల్లడించాడు. పాటల ప్రేరణ కలిగించాలి. కవిత్వం వీరుల్ని చెయ్యాలి. ధర్మాన్ని పాటించే పాలకులకు యీ ధోరణులు లలిత కళల ద్వారా రావాలి. చచ్చు కవిత్వాన్ని నిషేధించాలి. స్తోత్ర పాఠకులు, దేవతారాధన చేస్తూ భజనపరులుగా వుండే కవులు, వారి కవిత్వంతో రాజ్యంలో వుండడానికి అనర్హులు. సంరక్షకుల విద్య ప్రతి స్థాయిలో అతి జాగ్రత్తగా ఎంపిక చేయాలి.**

ప్లేటో భావవాదంలో సుప్రసిద్ధ ఉదాహరణ ఒకటి అందరూ పేర్కొంటుంటారు. సామాన్య జనానికి, తాత్విక పాలకులకూ తేడా చూపడానికి ప్లేటో యీ పోలిక తెచ్చాడు. ఒక కొండ గుహ వుందనుకోండి. అందులో శాశ్వతంగా కొందర్ని ఎటూ కదలకుండా బంధించారు. వారు ఒక వైపే చూడగలరు. వారి వెనుక మంట వున్నది. వారి ముందు గోడ వుంది. వారి నీడలు గోడమీద పడుతుంటాయి. ఈ నీడలే నిజమని వారనుకుంటారు. అవెలా వచ్చాయో వారికి తెలియదు. ఆ గుహ నుండి ఒక వ్యక్తి తప్పించుకొని బయట సూర్య కాంతిని చూస్తాడు. ఇన్నాళ్ళు చూచిన నీడలు వాస్తవం కాదని, బయట ప్రపంచంలో సూర్యుని వెలుతురులో కనిపించేవి నిజమని గ్రహిస్తాడు. మళ్ళీ వెనక్కు వెళ్ళి తన తోటి వారికి నిజం చెప్పాలనుకుంటాడు. అతడు పరిపాలించడానికి అర్హత గల తాత్వికుడు. వెళ్ళి నిజం చెబుతాడు. కాని వారికి నచ్చదు. వారికి నీడలే నిజం. పాలకుడి దృష్టిలో వారంతా మూర్ఖులు. సత్యం, మంచితనం అనేవి సూర్యకాంతి వంటివి. విజ్ఞానం, సత్యం అనేవి మంచితనంగా ప్లేటో పేర్కొన్నాడు. ప్లేటో భావాలు, ఉపమానాల వలన, ప్రప్రథమంగా విశ్వజనీన విషయాలు తత్వంలోకి ప్రవేశించాయి. విశ్వజనీనంగా వుండే అసలైన భావనల నుండి విడివిడిగా మనం చూస్తున్న విషయాలు వచ్చాయని, విడి విషయాలు వుండొచ్చు, పోవచ్చుగాని, విశ్వజనీనమైన విషయాలు వుంటాయని ప్లేటో ఉద్దేశం. అత్తదనం, మనిషి దనం, కుక్కదనం, ఇలాంటివన్నీ విశ్వజనీన భావనలైతే, అందులో నుండి అత్త, మనిషి, కుక్క అని మనం విడిగా చూస్తున్నామన్నాడు. ప్లేటో పేర్కొన్న యీ విశ్వజనీన భావనకు రుజువు, ఆధారం వుండదు.

ప్లేటో ఆత్మను నమ్మాడు. ఇది శాశ్వతం. శరీరం ద్వారా యిది వ్యక్తమౌతుంది. సృష్టిని నమ్మాడు. భూమి, గాలి, నిప్పు, నీరు అనే నాలుగు భూతాలను నమ్మాడు. కాలం కూడా సృష్టించబడిందన్నాడు. అరాచకం నుండి క్రమత్వం అనేది సృష్టి వలన ఏర్పడిందని ప్లేటో

కం.

జ్ఞానం గురించి కూడా ప్లేటో భావాలు నిర్దిష్టంగా వున్నాయి. ఇంద్రియ గోచరమైన జ్ఞానం సరైనది కాదు. ఇందులో గందరగోళం వుంది. భావనల ఆధారంగా ఏర్పడిందే సరైన జ్ఞానం. గణితం అలాంటి జ్ఞానమే. మైల్స్ బర్న్యియాట్ ననుసరించి ప్లేటో పదార్థవాద వ్యతిరేకి. జ్ఞానం అంటే ఏమిటో నిర్వచించకపోయినా విపులంగా చర్చించి, వివరించాడు. అదే పదివేలు.

## అరిస్టాటిల్ (క్రీ.పూ. 384-322)

ప్లేటో శిష్యుడుగా ఇరవై ఏళ్ళు, అలెగ్జాండర్ గురువుగా మూడేళ్ళు జీవితాన్ని చవిచూచిన అరిస్టాటిల్ అరవై గ్రంథాలు రాస్తే మనకు ఆరు మాత్రమే లభిస్తున్నాయి. మరో ఆరు నోట్స్ కూడా దొరికాయి. అవి పరిశీలిస్తేనే అరిస్టాటిల్ అనేక విషయాలలో శాస్త్రీయ ధోరణికి అంకురార్పణ చేసినట్లు అవగతమౌతుంది. ఏథెన్స్‌లో లైసియం అనే సంస్థ స్థాపించి కొందరు శిష్యుల్ని తయారుచేసిన అరిస్టాటిల్ మధ్యయుగాలపై తన తాత్విక చింతన ప్రభావంతో సుప్రసిద్ధుడయ్యాడు. కొన్నాళ్ళు తత్వవేత్త అంటే అరిస్టాటిల్ మాత్రమే అనే పేరు తెచ్చుకున్నాడు.

అరిస్టాటిల్ పట్టించుకున్నంతగా సామాన్య భాష, నమ్మకాలను ఎవరూ గమనించలేదేమో. మనం రోజూ వాడుకునే భాష నుండి జాగ్రత్తగా పరిశీలన చేసి, అందులో పరస్పర విరుద్ధత్వాలకు దారితీసే వాటిని చూచుకొని, ఏది నిలబడుతుందని, ఎంతవరకు వాటి ఆధారంగా ముందుకు సాగిపోవచ్చు అని గమనించమన్నాడు.

ఏ విషయాన్ని తీసుకున్నా మనం కొన్ని సందర్భాలలో నమ్మకాలపై ఆధారపడుతున్నామనీ, మరికొన్నిటిల్లో మన ఆలోచనలపై సాగిపోతున్నామనీ సులభంగా తెలుసుకోవచ్చు.

ఎర్ర రంగు కోటు వేసుకుంటే, దానిని పచ్చ రంగు కోటు అనం గదా. అంటే తర్కంలో పరస్పర విరుద్ధ విషయాలకు తావులేదు. అనుభవాన్ని మించి వూహించలేమని, నిత్యానుభవం మన ఆలోచనలకు ప్రాతిపదిక అనీ అరిస్టాటిల్ అన్నాడు. కనుక ప్లేటో చెప్పిన అత్తదనం, గుర్రపుదనం, పిల్లిదనం అనేవి అర్థం లేనివనీ, వున్నవల్లా అత్త, గుర్రం, మనిషి, పిల్లి అనీ అన్నాడు. వీటి వెనుక, శాశ్వతంగా అత్తదనం వున్నదనడం, వాటినుండి అత్త వచ్చినదనడం రుజావుకు నిలబడదన్నాడు. ప్రతిదాని వెనుక శాస్త్రీయ అవగాహన ఏమిటో తత్త్వవేత్త పరిశీలించాలన్నాడు. వాటి ఆధారంగా సూత్రాలను రూపొందించాలి. మనకు గల నిశిత పరిశీలనా శక్తి వలన అనుభవం, సాధారణ దృష్టి వెనుక ఎలాంటి సూత్రీకరణకు అవకాశం వున్నదో చూడగలం.

భౌతిక శాస్త్రం అనంతరం ఏయే విషయాలు ఆలోచించవచ్చు అని అరిస్టాటిల్ తర్కించాడు. ఇలా చేయడంతో కొన్ని నిర్ధారణలు చేయగలిగాడు. ఒక మనిషిని గుర్తించడానికి, అతడిలో నిరంతరం వస్తున్న మార్పుల్ని గమనించడానికి ఆధారాలేమిటి? మనిషి పుడతాడు, పెరుగుతాడు, వృద్ధుడౌతాడు. ఇదంతా జరిగే మార్పు. ఈ మార్పుల వెనుక ఒకే వ్యక్తి కొనసాగుతున్నాడు.

మనిషిలో ఎన్ని మార్పులు వచ్చినా, అతడిని గుర్తించే తీరు తెన్నులు వున్నాయి. రంగు

మారినా దుస్తులు మారినా అసలు మనిషిని గుర్తించకుండా వుండం గదా. మార్పుల వెనుక మౌలికంగా వుండే లక్షణాలున్నాయి. ఇలా ప్రతి వస్తువుకీ మౌలిక గుణాలు, మారే లక్షణాలున్నాయి. ఇవి రెండూ కలసి, సాగిపోతున్నాయని అరిస్టాటిల్ వివరించాడు. మార్పును, మౌలిక లక్షణాలను విడదీసి చూస్తే గందరగోళానికి దారితీయవచ్చు. మార్పుల వెనుక మనం గుర్తించగల మౌలిక లక్షణాలున్నాయని గ్రహిస్తే మార్పును, మౌలిక లక్షణాన్ని కలిపి చూస్తాం. వస్తువులున్నాయి. చెట్లు, కొండలు, నదులు, మనుష్యులు ఇవన్నీ చూస్తున్నాం. ఇవి మారుతున్నాయి. ఏ వస్తువునైనా గుర్తించడానికి మౌలిక లక్షణాలు ముఖ్యం. మనిషిని గుర్తిస్తే అతడు వేసుకున్న దుస్తులు, తినే ఆహారం, ఇతర లక్షణాలు నిత్యకృత్యంగా చెప్పవచ్చు. అంతేగాని, కోటు, భోజనం రంగును బట్టి ఇది ఫలానా మనిషికి చెందినదని చెప్పలేం. అంటే తాత్కాలికంగా మారేవి, వాడేవి వున్నా, మౌలిక లక్షణాలే గుర్తింపుకు అవసరం. వస్తువు, అది పనిచేసే తీరు, మనిషి, అతను నడచే విధానం వలన గుర్తిస్తామని అరిస్టాటిల్ తాత్వికంగా తన మెటాఫిజిక్స్‌లో చెప్పాడు.

ప్రపంచాన్ని చూచి అనేక మంది తత్వవేత్తలు అనేక తీరుల వివరణ యివ్వడానికి ప్రయత్నించారు. అద్భుతంగా వున్న ప్రకృతి, అందులోని వైవిధ్యం, మార్పులు అనేక వ్యాఖ్యానాలకు దారి తీసినవి. చెట్టు పుడుతుంది. పెరుగుతుంది. ఆకు వేస్తుంది. పూలు పూస్తుంది. ఆకు రాలుతుంది. ఎండిపోతుంది. వీటన్నిటికీ వివిధ కారణాలు చూస్తాం. వీటన్నిటికీ ప్రయోజనం ఏమిటి అని ఆలోచిస్తాం. ఇదంతా అరిస్టాటిల్ దృష్టిలో నాలుగు తీరుల్లో సాగిపోతున్నది. చెట్టు పుట్టడంలో పెరగడంలో అలౌకిక శక్తి ఏదీ లేదు. అది సహజమైనది. ఈ సహజ పరిణామాన్ని మనం చూచి, వర్గీకరించి, వివరిస్తాం. చెట్టుకు ఒకే లక్ష్యం. అతీత శక్తి ప్రకారం నడచుకోవడం ఏదీ లేదు. ఈ విషయంలో అరిస్టాటిల్ స్పష్టంగా చెప్పాడు. అన్నిటిల్లో ఆత్మ వుంటుందనే మాటను అతడు నిరాకరించాడు. జీవం అనే దృష్టిలో అరిస్టాటిల్ వాడిన పదాన్ని ఆత్మగా అనువదించి తప్పుదారిన పట్టించారని, మర్తానస్‌బాం (బ్రౌన్ యూనివర్సిటీలో అరిస్టాటిల్ నిపుణురాలు) పేర్కొన్నారు. చెట్లు, జంతువులు, మనుషులు జీవించే తీరును వివరించడానికి అరిస్టాటిల్ ప్రయత్నించాడు.

మంచి జీవితం గడపడానికి ఏం కావాలి అని అరిస్టాటిల్ ఆలోచించాడు. దీనికి ఒకే ఒక కొలమానం ఏదీ లేదు. వ్యక్తికి గల స్నేహం, ప్రేమాభిమానం ఇలాంటి లక్షణాలను జీవితంలో ఆయా సన్నివేశాల్ని బట్టి వినియోగిస్తాం. పొందికగా నడుచుకోవాలేగాని అన్నిటినీ అదుపులో పెట్టగలమనుకోరాదు.

అరిస్టాటిల్ తత్వంలో అనేక దోషాలు లోపాలు లేకపోలేదు. బానిసత్వాన్ని సమర్థించడం, స్త్రీలను చిన్నచూపు చూడడం పేర్కొనవచ్చు. కాని క్రీస్తుపూర్వం రాజుల సహాయంతో శిష్యుల్ని దూర ప్రాంతాలకు పంపి వస్తువులు సేకరించి, జీవశాస్త్ర పరిశీలన చేసిన ఖ్యాతి అరిస్టాటిల్‌కు దక్కాలి.

## తర్కశాస్త్రంలో ఆద్యుడు

పాశ్చాత్య తర్క శాస్త్రాన్ని ఆరంభించి, నేటికీ ప్రభావితం చేస్తున్న అరిస్టాటిల్ అటు క్రైస్తవ మతాన్ని యిటు ఆధునిక దార్శనికుల్నీ నడిపించాడు. తాత్విక రంగంలో ఆయన

ప్రభావం పునర్వికాసం అనంతరం క్షీణించింది. కాని తర్కంలో ఎంతో మార్పు వచ్చినా, నేటికీ అరిస్టాటిల్ తర్కం శిరోధార్యం అనే వారున్నారు.

అరిస్టాటిల్ తర్కంలో న్యాయ ప్రయోగం సుప్రసిద్ధమైనది.

మనుషులంతా చనిపోతారు.
సోక్రటీస్ మనిషి
కనుక సోక్రటీసు చనిపోతాడు.

ఇందులో మొదటిది ప్రధాన ప్రతిపాదన. రెండవది ఉప ప్రతిపాదన. వీటి నుండి రాబట్టిన నిర్ణయం మూడోది. తర్కంలో యీ దశ కేవలం ప్రాథమిక స్థాయి మాత్రమే. నేటి తర్కం చాలా దూరం పయనించింది. కనుక తర్కంలో ఆద్యుడుగానే అరిస్టాటిల్‌కు గుర్తింపు వుంటుంది.

ఏథెన్స్‌లో లైసియం సంస్థ నడిపిన అరిస్టాటిల్, నడుస్తూ వాదోపవాదాలు చేయడం, అనేక అంశాలు చర్చించడం వంటి పద్ధతులు ప్రవేశపెట్టాడు. ప్లేటో అనంతరం ఆయన యీ ప్రయోగాలు చేసి, పుస్తకాలు రాసి, సమకాలీన సమాజంపై ప్రభావం కనబరిచాడు. అలెగ్జాండర్ మరణానంతరం తిరగబడిన ఏథెన్స్ వాసుల చేతిలో చిక్కకుండా అరిస్టాటిల్ పారిపోయాడు. క్రీ.పూ. 322లో ఆయన చనిపోయాడు.

## కళలు, రామణీయకత

అరిస్టాటిల్ గురించి చర్చ ముగించడానికి అతడి కళ, రామణీయకత విమర్శ గమనించాలి. కళ అంతా అనుకరణే అని అరిస్టాటిల్ భావించాడు. డ్రామాను దృష్టిలో పెట్టుకొని యిలా చెప్పినట్లు, వినోదాత్మక, విషాదాంతాలను విడమరచి చూచినట్లు తెలుసుకోవచ్చు. నాటి గ్రీకు విషాదాంత నాటకాల దృష్ట్యా అరిస్టాటిల్ యీ చర్చ చేశాడు. నాటకంలో ఆద్యంతాలుండాలనీ, ఆత్మ ప్రక్షాళన లక్ష్యంగా పెట్టుకోవాలనీ ఆయన ఉద్దేశ పడ్డాడు. గ్రీకు డ్రామా, ప్లాట్, పాత్ర చిత్రణ యిత్యాదుల ఔచిత్యాన్ని బాగా విపులీకరించాడు.

విజ్ఞానంలో విషయ సేకరణ తొలి దశ. అరిస్టాటిల్ జీవ శాస్త్రంలో ఆసక్తి కనబరచాడు. ఆయన సేకరించదలచిన జీవశాస్త్ర పదార్థాలు, నమూనాలకు దాదాపు 400 లక్షల కోట్ల రూపాయలు అలెగ్జాండర్ ఖర్చు పెట్టాడు. నైలు నది యిన్ని పర్యాయాలు ఎందుకు పొంగుతున్నదో తెలుసుకునే ప్రయత్నంలో మనుషుల్ని పంపాడు. పెద్ద జంతు ప్రదర్శనశాల స్థాపించి, దేశ విదేశాల నుండి దాదాపు వెయ్యి మంది ద్వారా అనేక నమూనాలు సేకరించాడు. అయితే సేకరించిన వాటిని విడమరచి పరిశోధించడానికి తగిన పరికరాలు లేవని, ఇదంతా క్రీ.పూ. **300** ఏళ్ళ నాటి విషయమని మనం మరచిపోగూడదు. ★

(The Great Philosophers - Bryan Magee BBC Books
Bertrand Russell - The Wisdom of the West.
History of Western Philosophy). Platos writings

(గతసంచిక తరువాయి)

# చలంతో.. మధురవాణి

(ఊహాజనితం)

- పురాణం సుబ్రహ్మణ్యశర్మ

మధురవాణి: శ్రీశ్రీకి యోగ్యతాపత్రం యిచ్చాక కమ్యూనిస్టులంతా మీతో బాగానే వున్నారుగా? తర్వాత ఎందుకు బెడిసింది?

చలం : నా కొత్త చిగుళ్ళు అనే కథలో భిక్షువర్షీయసిలోని ముసలమ్మకు ఓ అక్క. దానికో కూతురు. అది చాలా సీమటపాకాయలా చలాకీ - అది చదివిన శ్రీశ్రీ కన్నా కమ్యూనిస్టులకు కోపం ఎక్కింది. అప్పుడు వాళ్ళ తృప్తికి శ్రీశ్రీ నా కొత్త చిగుళ్ళకు జవాబుగా 'హేమంతం' అనే పేలవమైన కథ రాశాడు. కథ నా Forte.

మధురవాణి: చలం కలం విశృంఖలం అని తెలియక కాబోలు-

చలం : నేను వాళ్ళ అక్కనీ, ఆ వర్గాన్నీ చాలా వేళాకోళంతో అవమానించాననుకున్నారు. నా సౌందర్య పిపాసకి వాళ్లంతా అపస్వరాలన్నాడు శ్రీశ్రీ. మొపాసాని టాల్‌స్టాయ్ చివాట్లు పెట్టినట్టు భిక్షువర్షీయసి చేత నాకు చివాట్లు పెట్టించాడు శ్రీశ్రీ.

మధురవాణి: అవును. గూటాల కృష్ణమూర్తి లండన్లో వేసిన రు.750/- మహాప్రస్థానంలో మీ యోగ్యతా పత్రం లేదని తెలుసా? అది తీసెయ్యడానికి శ్రీ శ్రీ వప్పుకున్నారు. కారణం? చదివేవారు బతికి లేరట.

చలం : మహాప్రస్థానం రు. 750/- లా?

మధురవాణి: అదంతా లండన్ గొడవ. అందులో మీ యోగ్యతా పత్రం లేదని ఆంధ్రదేశంలో అంతా దెబ్బలాడారు? చలం పీఠికలేని మహాప్రస్థానం ఏవిటని?

చలం : కమ్యూనిస్టులకి సెంటిమెంట్లు వుండవు.

మధురవాణి: అసలు నాకా ఉద్దేశమే లేదు. ఇదంతా జరుక్‌శాస్త్రి పురమాయింపు అన్నారు శ్రీశ్రీ ఎటూ చెప్పలేక!

మధురవాణి: మీ నిరీశ్వరవాదం ఎప్పుడు మొదలయింది?

చలం : రవి మరణంతో 1929లో.

మధురవాణి: మీ రచనలు కొన్ని అనువాదాలూ అనుసరణలు మూలం చెప్పలేదని మీమీదో ఆరోపణ వుంది? అదెట్లా?

చలం : దైవమిచ్చిన భార్యపై వెల్స్, పాల్ కెయిన్‌ల 'పాషనేట్ ఫ్రండ్స్' 'వుమెన్ దొగివెన్ట్‌మి'ల ప్రభావాలు వున్న మాట నిజం. నా ఆశయాలకు ఆలోచనలకు దగ్గరగా వున్న వాటినన్నీ తీసుకున్నా. ఫ్రెంచి నవలా రచయిత మార్షల్ ఫాన్ట్, జర్మన్ నవలా రచయిత డబ్బునిన్ హెర్మిన్‌ల నుంచి కూడా ప్రేరణ పొందాను. ఇబ్సన్, షా, రస్సెల్‌ల రచనలు అవుపోశనం పట్టా - ప్లేటో, రూసో, మార్క్స్, బర్కిలీ మొదలయిన రాజకీయ సాంఘిక శాస్త్రవేత్తలందరినీ చదివా. వర్డ్స్‌వర్త్, కీట్సు, బైరన్, షెల్లీల కవితా స్రవంతులు తనివి తీరగా గ్రోలాను. అయితే ట్రాజిడీ ఏమిటంటే - చెప్పమంటావా?

మధురవాణి: అయ్యో దాపరికం దేనికి చెప్పండి.

చలం : మన సాహిత్యంలో అభిప్రాయాల్లో ఆలోచనల్లో కొత్త మార్గాన్ని తొక్కిన వాళ్ళలో నేనొకణ్ణి. అయితే నా పబ్లిషర్లు, నేను కింద మూలం రాయడం వారు తీసెయ్యడం-అచ్చులో అన్నీ సొంతాలుగా రావడం వలన చలం పెద్ద దొంగ అని మీరంతా అనుకున్నారు. మీ పేరుతో వస్తే చాలు అనేవారు ప్రచురణకర్తలు. చివరకు విసిగి నేను పట్టించుకోవడం మానేసా.

మధురవాణి: మీ అమ్మాయికి సౌరిస్ అని కొత్త పేరు ఎలా వచ్చింది?

చలం : నీకు మధురవాణి అనే పేరు ఎలా వచ్చింది?

మధురవాణి: తెలీదు. చెప్పండి వింటా.

చలం : విప్రనారాయణలో దేవదేవి అప్పగారు మధురవాణి. అక్కడ్నుంచి లాగారు అప్పారావుగారు. అల్లాగే 'సౌరిస్' అనేది ఒక ఆంగ్ల నవలలోని ఫ్రెంచి కథానాయిక పేరు.

మధురవాణి: 1921 ప్రాముఖ్యం ఏవిటి మీ జీవితంలో?

చలం : ఏప్రిల్ 13న సౌరిస్ పుట్టింది. హాస్పెట్‌లో వుండగా నా మొదటి నవల శశిరేఖ రాశా. ముద్దు కృష్ణతో కలిసికొన్నాళ్ళు జ్వాల పత్రిక నడిపా. ఈ కాలంలోనే 'వోయిన' డాక్టర్ రంగనాయకమ్మకి వీలుగా వుంటుందని మకాం బెజవాడకి మార్చాను. రంగనాయకమ్మ గారి ఆసుపత్రి భర్తృహీనలు. సంఘ బహిష్కృతలకు ఎంతో మందికి ధర్మశాల. నా భార్య టి. మొదటి మహిళా జీవిత భీమా ఏజెంటు. నేను నాస్టూడెంట్సుతో కలిసి నాటకాలు వేస్తూ వుండే వాణ్ని.

మధురవాణి: దీక్షితులు గారూ నాయుడుగారూ కాకుండా మిమ్మల్ని ప్రభావితం చేసిన మూడవ వ్యక్తి ఎవరు?

చలం : ఇంకెవరు? భగవాన్ రమణ మహర్షి

మధురవాణి: ఖద్దరు కట్టారా ఎప్పుడన్నా?

చలం : ఏలూరి నుంచి గుంటూరుకి బదిలీ అయితే మాష్టర్లంతా ఖద్దరు కట్టి గవర్నర్‌ను చూడ్డానికి వెళ్తే, నేను మాత్రం ఆడవాళ్ళు వేసుకునే జంపర్ వేసుకుని వెళ్ళా.

మధురవాణి: పై ఉద్యోగుల ఒళ్ళు మండదా? (నవ్వు)

చలం : వాళ్ళ ఒళ్ళుమండాలనే (నవ్వు) వెంటనే నరసరావుపేటకు బదిలీ.

మధురవాణి: ఎందుకీ రొష్టూ అల్లరీ?

చలం : అధికార్లకు నాకూ చుక్కెదురు. సరైన సూట్సు వేసుకుంటాననీ, ఎక్కువగా నవ్వననీ, అరవైఏళ్ళ వాడికి మళ్ళీ నడుస్తాననీ, నా కింది టీచర్లనీ జవాన్లనీ, రోజూ చివాట్లు క్రమంగా వేస్తూవుంటాననీ, జీవితంలో బాధల్ని గురించి, నా గతి సంగతీ రోజుకి మూడుసార్లు కనపడ్డ వారితో ఏడుస్తాననీ, వార్తత్తాలు చేసొచ్చారు నా తరపున, నాకీ పని తెప్పించేందుకు.

మధురవాణి: మీకెప్పుడూ ప్రమోషన్ రాలేదా?

చలం : రాకేమి? 1924లో రాజమండ్రి నుంచి బందరు ప్రమోషన్‌కు వెళ్ళి - అక్కడ అహోబలరావుతోను, జంగం కోటయ్య దేవర కొడుకు సుబ్రమణ్యా దేవర తోనూ స్నేహం చేశా.

మధురవాణి: బందర్ వెళ్ళాక ఏదో ఒక గొప్ప పని చెయ్యకుండా ఎవరూ వూరుకోలేదు. మీరక్కడేం చెయ్యలేదా?

చలం : చెయ్యకేమి? బందర్ నోబుల్ కాలేజిలో యింటర్ నేషనల్ బ్రాంచీలో Man & Woman అనే పెద్ద ఆంగ్ల వ్యాసం చదివా. అదే 'స్త్రీ' రచనకు ప్రారంభం.

మధురవాణి: మధ్య తరగతి నైతిక విలువల్ని షాక్ చెయ్యటమంటే మీకు సరదా అనుకుంటా?

చలం : సరదా కాదు కసి. అయితే మైదానం ఒక ఆర్టిస్టిక్ పీస్. దానిలో షాకింగ్ గుణం చాలా సెకండరీ.

మధురవాణి: మిమ్మల్ని గోపీచంద్‌గారు విమర్శించాడనుకుంటా - మీ స్త్రీ పాత్రలకు ఆర్థికమైన సమస్యలేవీ పట్టక పోవడం వెలితి కాదా?

చలం : గోపీచంద్ కోతి. నాకు నేను సిన్సియర్‌గా వుండటానికి ప్రయత్నిస్తాను. I have no stakes, ఎటు మొగ్గినా, దేంట్లో కలిసినా, ఏం నమ్మినా నాకు వచ్చే నష్టాలేమీ లేవు. ఏ పల్టీ కొట్టడానికి నేను సిగ్గుపడను. నాకు వాస్తవమని నిశ్చయంగా తోచాలి.

మధురవాణి: మీలో అశాంతికి కారణం?

చలం : లోకానికీ నాకూ ఏదో సరిపడని సంబంధం ఏర్పడింది. నాకన్న గొప్ప దాంట్లో దేంట్లోనో లయమైపోతే బావుంటుందనిపిస్తుంది. కాని అదేదో కనపడదు.

మధురవాణి: మీకు కాశీలో సంస్కృత విద్యాలయ మందిర్ ఏదో బిరుదిచ్చిందట?

చలం : 'సాహిత్య మనీషి' అన్నారు. బిరుదులూ సన్మానాలూ సభలూ అక్కర్లేదని నేను దాన్ని నిరాకరించాను.

మధురవాణి: ఈ 'లీల అంటారెవరు?'

చలం : నా జీవితాన్ని యీ భూమి మీదనే అమృతంలో నింపగల స్త్రీని ఇచ్చారు భగవాన్ నాకు. అంతటితో నాకు తనివి తీరలేదు. లీల దృష్టి వ్యక్తిజీవితపు అందం మీద, నా దృష్టి ప్రత్యేకమైన ప్రయత్నాల విలువల మీద. ఆమె దృష్టి భూమి మీది ప్రపోర్షన్స్ పైన; నా దృష్టి ఆకాశపు Beyond proportions పైన.

మధురవాణి: ఆవిడతో మీకెలా పరిచయం?

చలం : ఆమె తన పదమూడవ యేటనే నా పుస్తకాన్ని చదివి పిఠాపురం స్వగ్రామం కావడంవలన కృష్ణశాస్త్రి ద్వారా నా సాహిత్యం వైపు ఆకర్షితురాలై నా దగ్గరకు వచ్చింది.

మధురవాణి: మళ్ళీ ఏమైంది చివరకు?

చలం : నా వంటి స్త్రీ తనను కోరివచ్చిందంటే ఎటువంటి పురుషుడైనా సెవెన్త్ హెవెన్‌లో వుండే వాడు. నీకెక్కడా తృప్తిలేదు. శాంతి లేదు. కృతజ్ఞత లేదు- అందినన్ను లీల. నేను భగవాన్ వైపు మరో ప్లేన్‌లోకి జరిగాను, దానిముందు తను ఇన్‌ఫీరియర్‌గా ఫీల్ అవుతుంది. దాంతో ఆమె అహం అధికంగా పైకి లేచి - 1949వ సంవత్సరంలో లీల నన్ను వదలి వెళ్ళిపోయింది.

మధురవాణి: ఎవరు మీకు ఉత్తరం రాసినా జవాబిచ్చేవారట?

చలం : అదొక అలవాటు. ఎవరు నాకు రాసినా స్పందించే గుణం నాది.

మధురవాణి: టాగూర్ అంటే మీకు ప్రాణం అనుకుంటా.

చలం : టాగూరు కవిత్వం యీ బొమికల్లోకి ఎక్కింది. బ్రహ్మ సమాజమూ దేవుడూ భక్తి నన్ను వొదిలి పోయిందాకా, ఒక ఐదేళ్ళు టాగూరు కవిత్వం తాగి బతికాను. ఆయన వ్రాసిన భక్తి నన్ను వొదిలినా కవిత్వం వొదల లేదు... భక్తులకి ప్రేమ గీతాల్లో భక్తి గోచరిస్తుంది.నాకు భక్తిగీతాల్లో ప్రేమ గోచరిస్తుంది.

మధురవాణి: మీ కెప్పుడన్నా సన్మానం జరిగిందా?

చలం : 1960లో చిత్తూరు నుంచి శారదాపీఠం ఆధ్వర్యంలో కె. సభా వందమంది రచయితలు కళాకారులతో వచ్చి రమణాస్థాన్ తిరువణ్ణామలైలో నాకు సన్మానం చేశారు. అదే మొదటిది.

మధురవాణి: ఆనందం అంటే ఏమిటి?

చలం : నరాల సంచలనం. స్త్రీ నించి పొందే ఆనందాన్ని ఆకాశపు నీలత్వంలోంచి, నీళ్ళ చల్లదనంలోంచి, గడ్డి మెత్తదనంలోంచి, పువ్వుల మెరుగులోంచి పొందాలి.

మధురవాణి: సుఖం దేనికి?

చలం : స్వేచ్ఛ లేని సుఖంలో మనిషి నిలవలేడు. తన స్వంత సుఖాల్ని తనలోపల్నుంచి కట్టుకోవాలి మానవుడు. లోకంలో మనం ఏర్పరచే సుఖపద్ధతి జంతు ప్రదర్శన శాల జంతువులుకిచ్చినంత సుఖాన్ని యిస్తుంది.

మధురవాణి: మిమ్మల్ని ఆనందోపాసకులు అనవచ్చా?

చలం : మనిషిలో ఎట్లా వుందో, ఎందుకు వుందో అతని లోపలే గొప్ప ఆనందం వుంది. అయితే ఒకప్పుడు లోపలి ఆనందాన్ని పై వస్తువుల సహాయంతో అనుభవిస్తున్నాడు. లోపలి ఆనందాన్ని అందుకుంటే జీవితం ప్రతి నిముషం ఆనందమయం కాదా?

మధురవాణి: భావకవులు తీసుకొచ్చిన అమలిన శృంగారం గురించి మీరేవంటారు?

చలం : మధురవాణి అనే వేశ్యారత్నం అమలిన శృంగారం గురించి అడగటమా? నేను మీ పక్షమే. భౌతికం కాని కేవల మానసిక శృంగారాన్ని నేను నిరసిస్తాను. ఎందుకు బ్రతుకుతున్నావు అంటే ప్రేమించేందుకు, ప్రేమని వెతుక్కునేందుకు అని చెప్పగలగాలి.

మధురవాణి: కాలం దేశంవల్ల నీతులూ ధర్మాలూ మారతాయా?

చలం : అంతరాత్మే నీతికి ప్రమాణం. ఏ మనిషి కామనిషికి ఏది తనకి ధర్మమో, కర్తవ్యమో స్పష్టంగా తెలుస్తూనే వుంటుంది. స్వార్థం నుంచి దూరమైన కొద్దీ వున్నతుడవుతాడు మనిషి. నీకులా-

మధురవాణి: నన్నెందుకు పొగడ్డం?

చలం : నీకున్న క్లారెటీ (స్పష్టమైన అవగాహన) నాకు లేదు. లీల గారి కంటె నువ్వే ఎన్నో రెట్లు నయం. నీకు అహంకారం అడ్డం రాదు. పోనీ నువ్వు నాతో వచ్చేస్తావా?

మధురవాణి: నేను మీతో వచ్చేస్తే అక్కడ మా అమ్మకి గడవడం ఎల్లాగ?

చలం : పోనీ మీ అమ్మని కూడా మనతో వుండమంటే-

మధురవాణి: ఆమె రాదు. చెడినవారిని యింకా చెడగొట్టవద్దని మా తల్లి ఆదేశం.

చలం : ఎవరో సత్పురుషుడు కాలుజారిన పిల్లవై యుంటావన్నాడు సౌజన్యారావు పంతులు నిన్ను.

మధురవాణి: మీరేమంటారు?

చలం : నిన్ను చూశాక కాల్జారకుండా వుండటం అబ్సర్డ్ అంటాను.

మధురవాణి: (నవ్వి) ఈ ఒక్కటీ చెప్పండి. దేన్ని సౌందర్యం అనొచ్చు?

చలం : నరాల్ని నీలా అందంతో లాగి బాధించేది. ఏదో రహస్యమైన ఆకర్షణ, ఏ నడకో, ఏ మాట మాధుర్యమో, ఏ కామవిస్ఫురణో నీకు దాసుల్ని చేసుకుంటాయి.

మధురవాణి: నన్ను పట్టించారేమిటివ్వాళ?

చలం పోలికలకూ, ఉపమానాలకూ అందని నీ స్వభావం ఆత్మకు సంబంధించినదై వుంటుంది. గొప్ప ఆత్మ లేకుండా గొప్ప సౌందర్యం యెక్కడ? సౌందర్యానికి అంధులు కావటం కన్నా సౌందర్యం మామూలయి పోవటం కన్నా మృత్యువు వేరే లేదు.

మధురవాణి: సౌందర్యాన్ని పూజిస్తూ కూచుంటే నవ్వరా?

చలం శృంగార భావం, సౌందర్య తృష్ణ మలినమే అయితే నేనూ మలినుణ్నే. స్త్రీ చవక కావడం వల్ల స్త్రీ సౌందర్యాన్ని పూజించటం మానేశాడు.

మధురవాణి: కవిత్వానికీ కవికీ వుండే సంబంధం?

చలం : దీపానికీ కాంతికీ వుండే సంబంధం వంటిది.

మధురవాణి: కొత్త కవులు కూడా పాత వర్ణనలు కవి సమయాలు, పాటించడం?

చలం : మతం పేరిట ఏ వికృతమయినా చలామణి ఐనట్టే కవిత్వం పేరిట ఏ అసందర్భమైనా మెప్పు పొందుతుంది.

మధురవాణి: కళకు సామాజిక ప్రయోజనం చాలదా?

చలం : అంతకు మించిన ప్రయోజనం వుంది. అది రసానుభవం. ఇది గుర్తించ నిరాకరించినందువల్లే అభ్యుదయ కవిత్వ ఉద్యమం చచ్చింది.

మధురవాణి: పాపం కమ్యూనిస్టులు తలపెట్టిన అభ్యుదయ రచయిత ఉద్యమం చివరకేమయింది?

చలం : కళకి ఉద్దేశం ఉండాలి. ప్రజాసేవ చెయ్యాలి. అని ఆందోళన పడిన కొద్దీ అందానికి దూరమవుతున్నారు రచయితలు. దూరమే కాదు విరోధులవుతున్నారు. ప్రతి రసపుష్టిగల రచయితనీ కళకి విరోధి అని చండాడారు. చివరకా ఉద్యమం చచ్చింది.

మధురవాణి: కమ్యూనిజంలో కళ(లు) ఎలా వుంటాయి?

చలం : అక్కడ వ్యక్తిగతమైన స్వేచ్ఛా ఒప్పుకోరు. కళాకారుడికి స్వేచ్ఛ లేదు. అందుకనే అక్కడి కళలో టెక్నిక్‌లు ఎక్కువా రసం తక్కువాను. కళని సృష్టించే ఆర్టిస్టులూ, దాన్ని పూర్తిగా అనుభవించే మనుషులు వారు ఒక కల్చరల్ అరిస్టాక్రసీ. ఏ అరిస్టాక్రసీని అంగీకరించని దేశంలో కళ విజృంభించదు.

మధురవాణి: ఐతే గొప్ప కళ ప్రజాబాహుళ్యంపై ఏ మార్పూ తేలేదా?

చలం : కొందరి మీద పనిచేస్తుంది. కొందరి మీద ఏ ప్రభావం వుండదు. ప్రజాబాహుళ్యంపై ఏ మార్పూ తీసుకుని రానట్టు పైకి కనిపించినా, కనిపించని లోతైన మార్పు జరగడం గమనించవచ్చు.

మధురవాణి: విద్యావిధానం గురించి మీ అభిప్రాయాలు...

చలం : విద్య అంటే ఆనందించే శక్తిని వృద్ధి చెయ్యటం. సౌందర్యానికి కళ్ళు తెరవడం, బాధల్నించి కష్టాల్నించి తప్పించుకునే నేర్పునివ్వడం, ఇతరుల స్వేచ్ఛల్ని అడ్డగించే స్వార్థపరత్వం నించి, అంతా తనకే కావాలని దాచుకునే కాపీనం నించి, భయాల నించి తప్పించడం.

మధురవాణి: నేటి విద్యావిధానం గురించి నేనడుగుతా-

చలం : రాజకీయాలతో పెనవేసుకుని వుండడం వల్ల రాజకీయాలూ ప్రభుత్వపు పాలసీ పరిశుద్ధమైతే గాని విద్యా విధానం చక్క బడదు. మలేరియా, క్షయ, దారిద్ర్యం, కుష్టు కల్పించిన శక్తులే మానవజాతికి యీ విద్యావిధానాన్ని, వివాహ సంస్కారాన్ని కట్టాక్షించినాయి.

మధురవాణి: ప్రశ్నించే మనస్తత్వం అయితే వుంది కాని మీకు మీదైన తాత్విక పునాది ఏదీ లేదు అంటారు. నిజమా?

చలం : ప్రశ్నించడం ఎందుకా? నాది అట్లాటి మనసు. ఎప్పుడూ ప్రశ్నిస్తుంది. సత్యం? సత్యం ఏమిటి ఎక్కడ వుంది? అన్నది అనాదిగా వొస్తున్న ప్రశ్న.

ఈ ప్రశ్నని పట్టుకుని జీవితాన్ని తరచాలి. కబీర్ అమృతానుభవం, టాగూరు భక్తి ప్రణయం, భగవాన్ అద్వైతభావం అన్నీ సత్యాలే. చాలా వరకు ఆధ్యాత్మిక విద్య అంటే సబ్‌కాన్‌షస్‌ని తరచడం లాగ తోస్తుంది. చెట్టు కాలం ఫలితంగా పువ్వులు పూసినట్లు ఏ కొద్ది మందిలోనో వికసిస్తుంది గొప్ప అందం, ఆదర్శం. ద్వేషించినా ప్రపంచం వాళ్ళ అడుగుజాడల్లో ముందుకు సాగుతుంది. నిరంతరం మానవజాతిని నిలవనీక, నిద్రపోనీక, వెతికించే ప్రోద్బలమే నా రక్తంలోనూ పలుకుతోంది. అన్వేషణలన్నీ నిరర్థకాలూ అబద్ధాలైతే నాయత్నమూ అంతే.

మధురవాణి: మీ అన్వేషణ ఎక్కడికి?

చలం : నీ పెదవుల్నీ కళ్ళనీ చేతుల్నీ నావాటిని చేసుకోలేను, నిన్ను కావిలించుకోగలను అంతే.

(చలం మధురవాణిని కావిలించుకుంటాడు. ఆమె చలాన్ని ముద్దుపెట్టుకుంటుంది గాఢంగా)

చలం : క్షణాలని నమ్మిపరిగెత్తి పోయే స్వల్ప ఆనందాలతోనే సుఖపడదాము. ఏదో వొరుగుతుందని నమ్మి మాడిచావనీ వేదాంతుల్ని.

మధురవాణి: నేను అంటే మధురవాణి వుండదు. అంటే లోకమే వుండదు. ఎట్లా వుంటుంది నేను లేకపోయింతరవాత? కాని వుంటుందే? మరియెట్లా వుంటుంది?

చలం : జీవితం మీద మనసుకి అంత ఆసక్తి వుంది. అంత అనురాగం వుంది. అందువల్లనే 'నేను లేకపోతే లోకం యేదీ' అనే అహంభావం.

మధురవాణి: అంతేనా?

చలం : అవును అంతే - ఏదీ ఒక చిన్న ముద్దు...

(పూర్తయింది)



చలంగారు మైదానం రాయడానికి మూలమైనవి; సైబీరియా (CHIKOVE) చికోవ్ అనే జార్ కాలం ముందు రచయిత, Westerly winds (ప్రేరణ) అంటారు. దైవమిచ్చిన భార్యకు మూలం H.B. Wells Galsworth ఆధారం. జీవితాదర్శం 'భైరాగి నకలు' రోనా బంద్. చలం అంటారు మూలం రాసినా ప్రచురణకర్తలు వేసేవారు కాదని. తన ఉద్యమానికి అవసరమైన పోరాట శక్తికి పనిముట్లుగా సాహిత్యాన్ని ఎక్కడున్నించయినా తెచ్చి ఉపయోగించుకున్నానే గాని అది తన ముఖ్యమైన రణరంగం కాదు, సెకండరీ అంటాడు చలం.

# నాదబ్రహ్మ బీథోవెన్

అనువాదం
రవీంద్రనాథ్

లుడ్విగ్ వాన్ బీథోవెన్స్ (1779-1827) అనేది పూర్తి పేరు. సంగీతనిధి; తన ఒంటరి జీవితాన్ని సంగీతంలో సమతులం చేసుకున్న ప్రతిభావంతుడు. చెముడుతో వచ్చిన పెంకెతనాన్ని సంగీతంతో ఆర్ద్రీకరించుకున్న దిట్ట. వ్యక్తిత్వానికి లయ శృతులను మేళవించుకుని, తన జీవిత కాలంలోనూ, తాను పుట్టి ఈ డిసెంబరుకు 220 ఏళ్లు దాటుతున్నా నేటికీ నవనవోన్మేష సంగీతవాణిగా సజీవంగా ఉండగలుగుతున్న అపూర్వ వ్యక్తి.

అతడిని ఆదరించిన ధనికులు కూడా కొందరు లేకపోలేదు. కారల్ లిచ్నోవ్‌స్కీ అనే రాజకుమారుడు ఇటువంటి పోషకవర్గంలో ఒకడు. కానీ అతడితో బీథోవెన్‌కు ఏదో మాట పట్టింపు వచ్చింది. వెంటనే అతడికి ఒక జాబు వ్రాశాడు. ''రాజకుమారా! పుట్టుక వలన, పరిస్థితుల వలన నువ్వు రాకుమారుడివి. నేను స్వయంకృషివలన నా ఇప్పటి స్థితికి చేరుకున్న వాడిని. రాజకుమారులు వేలాది మంది దొరుకుతారు. కానీ బీథోవెన్ మాత్రం ఒక్కడే వ్యక్తిగా చరిత్రలో స్థానాన్ని సంపాదిస్తాడు.''

అదీ ఒక రాజకుమారునికి తెలియజెప్పిన విధం. ఇక తన సంగీత ప్రత్యేకతను గురించి, అతడి ఆత్మవిశ్వాసం ఎట్లా పలికిందో చూడండి.

ఒక పర్యాయం అతడి కృతి ఒకటి శ్రోతలకు బాగా లేనట్లున్నదని ఒక స్నేహితుడనగా బీథోవెన్ వెంటనే జవాబిచ్చాడు. ''కొద్దికాలంలో వాళ్లే మెచ్చుకుంటారు.''

నిజమే ఏళ్లు గడిచిన కొలదీ అతడి కృతులను ప్రపంచ సంగీతప్రియులు ఇతోధికంగా మెచ్చుకొన గలుగుతున్నారు. తరతరానా అతడి ఆకర్షణ పెరిగిపోతున్నది.

జీవితంలో ఎక్కువ కాలం చెముడుతోనే గడిపాడు. మంచి శబ్దాలు గానీ, చెడు శబ్దాలు గానీ విన నోచుకోలేదు. కానీ మనోజ్ఞమైన శబ్ద సమ్మేళనాలను సృష్టించాడు. ఆ స్వర మాలలను వింటే అతడిలో ఏ కొంచెం నిరాశగానీ, కర్కశత్వం గానీ, వికారం గానీ లేదని విదితమవుతుంది. ఆయన స్వరసంపుటి శుద్ధ ఆహ్లాదకారి; ఆనందానికి గేయరూపం: నిసర్గ రమణీయతకు సారం; స్వచ్ఛంద ప్రవృత్తికి దర్పణం; చిత్తవృత్తుల సమాహారం. అతడి హావభావ విలాసాలకు మేలి ముసుగు. ఆ స్వరమేళనలు అతడి నిత్య యవ్వన ప్రకటనలు. ఎప్పటికప్పుడు అతడు కొత్త తరాన్ని కలవడానికి చూపే ఉత్సాహ తరంగాలు స్వర జ్ఞానంతో అతడికి అబ్బిన సలక్షణం. తన శ్రోతల సుఖానుభూతి పట్ల ఆసక్తి.

బధిరత్వాన్ని ఎట్లా అధిగమించడం అనేదే అతడి జీవితంలో ప్రధానమైన యావ అయి ఉంటుంది. సంగీతాన్ని దానికి మించిన యావగా పెంచుకున్నాడు. మంచి స్వరాలను ఊహించుకొన గలిగాడు. వేరే శబ్దాలేవీ అతడి చెవులలో దూర లేదేమో! అతడి హృదయానికి ఏ ఏ స్వరమేళనలు సంతర్పణ చేసినవో వాటినే ప్రపంచ సంగీత ప్రియులకు వారసత్వంగా ఇచ్చిపోయాడు. చెవిటివాడు కవిత్వం చెప్పవచ్చు. చిత్రలేఖనం చేసుకోవచ్చు. రాళ్ళు చెక్కుకొన వచ్చు. కానీ సంగీతం వినిపించడం వింత! బీథోవెన్ చెమిటివాడు. ప్రజలకు తన స్వర పాంచజన్యం వినిపించాడు. వినిపించుతున్నాడు నేటికి.

అతడి కళ్లముందు స్వరాలకు నోళ్లు విచ్చి, అవి ఆడి ఆడి అతడిని స్వర వివశుని చేసి ఉంటాయనుకోవాలి.

బీథోవెన్ అంతరంగం స్వర ధామమై ఉండాలి. అక్కడే అది వాద్యమేళనం జరిపి,. ముందుగా అతడికి దర్శనం ఇచ్చి ఉంటుంది. సంగీతం అతడికి పిత్రియం.

1802లో అతడి వయస్సు 32 ఏళ్లు. తన చెవుల స్థితి బ్రహ్మచెముడులోకి దిగజారబోతున్నదని గ్రహించుకొన గలిగాడు. పుట్టిన బాన్‌లోనూ, పెరిగిన వియన్నాలోనూ అప్పటి పరిస్థితిలో ఆలోచన కుదరక, హైలిగేన్ స్టాట్ అనే ఊరు వెళ్లి తన శారీరక, మానసిక స్థితిని గురించి వ్రాసుకున్నాడు.

''నేను పెంకె వాడిననీ, విరుద్ధ చరితుడననీ, లోక ద్వేషిననీ నమ్మి నిందించే మానవులారా! మీరు నా పట్ల ఎంత అన్యాయ వైఖరినవలంబిస్తున్నారు'' మీకు నేను అట్లా కనపడడానికి గుప్త కారణం ఒకటి ఉన్నదని మీకు తెలియదు. అదే నాకు యావజ్జీవితం వైకల్యం కలిగించేది. దూరం నుంచి వస్తున్న మురళీ స్వరాన్ని నా పొరుగువాడు వినడం ఏమిటి? నేను వినలేక పోవడం ఏమిటి? గోపాలకుడు పాడే పాట నా పక్కవానికి వినరావడం ఏమిటి! నాకు వినపడక పోవడం ఏమిటి? ఏది ఏమైనా అంతరంగం నుంచి బహిర్గతం కావాలని విధి నిర్ణయం ఉన్నంత మేరకు నేను వెలువరించే తీర్తాను. అంతవరకూ ఈ ప్రపంచాన్ని వదిలిపోను! వదిలి పోవడం అసాధ్యం!!''

ఆత్మహత్య చేసుకుని ఈ ఆవేదనను అంతం చేసుకోవాలని ఆలోచించాడు కానీ, అంతకంటే విధిని వశం చేసుకుని జీవిత యాత్ర కొనసాగించడమే పురుషకారం అని గాఢంగా విశ్వసించాడు. అతడు సంకల్ప సిద్ధుడు. స్వతమేళనలు, వాద్య విన్యాసాలు అతడిలోంచి ఉబకజొచ్చినాయి. స్థూల శ్రవణం వికలమైనా, సూక్ష్మ శ్రవణం పనిచేయ సాగిందనే చెప్పుకోవాలి. విశుద్ధ సంగీత కృతులు వెలువరించ గలిగాడు.

అతడికి చెముడు లేనిదే అంత శుద్ధనాదం వెలువడేదేనా! చెముడు వలన ప్రశాంత చిత్తుడైనాడు. నాద ప్రపంచ విహారి అయినాడు. సంగీత ముద్ర తరంగాలు అతడి చేతనను చెలియలికట్ట చేసుకున్నాయి.

త్యాగరాజు పాడిన కృతులను మూడు వర్గాలుగా విభజించవచ్చు. రాముడనే సగుణ దైవాన్ని సంకీర్తనం చేసేవి, దైవశక్తిని గురించి ప్రశ్నించేవి (మనస్సును ప్రశ్నించేవి), పేర్లు ఏవి అయినా దైవం నిర్గుణుడు అని నాదోపాసన తత్వాన్ని వ్యక్తం చేసేవి.

అట్లాగే బీథోవెన్ కృతులను మూడు కాలాలకు చెందినవిగా విభజించవచ్చు. చెవుడు రాకముందు రచించినవి, అంటే తనకు చెవుడు వస్తోందని అతడు గ్రహించక మునుపు కూర్చినవి.

చెముడు పుట్టిందని తెలిసి ఆవేదన పడుతూ, ఆవేదనను అధిగమించే కృషి కొనసాగిస్తూ జీవితయాత్ర చేసిన కాలం. ఈ కాలంలో గొప్ప కృతులు వెలువడినాయి.

చెముడు స్థిరం అని తెలుసుకుని విధిని వశం చేసుకున్నాం అని తెలుసుకుని, ప్రశాంత చిత్తుడై చేసిన కృతులు. ఇది మంగళసంగీతం లాంటి కాలం; చరమ గీతం లాంటిది; జీవిత సంధ్యను సూచించేది; ప్రౌఢత్వానికి ఉదాహరణ.

బీథోవెన్ స్వర జ్ఞానశక్తికి ముందు ప్రకృతికి గోప్యం ఏమీ ఏనాడు ఉండేది కాదు. ఆయన జీవితంలో కొన్ని సన్నివేశాలు, ఆయన కృతులు ఈ యదార్థాన్ని విదితం చేస్తాయి.

లయగోపావని (పాశ్చ్యారల్ సింఫనీ) అతడి కృతులలో జానపద సౌందర్య విలాసాలకు మేటి స్వరచిత్రం. ప్రకృతికి, ప్రకృతి-గ్రామీణుల లీలా విలాసాల చిత్రణ. సరిగ్గా చిత్రం తీసినట్లే-ఒక వాగు ఒడ్డున జరిగిన కలాపాలు, గాలివాన, ఆ తర్వాత నెలకొన్న శాంతి - ఈ సన్నివేశాలన్నీ హాయిగా ఒక సమాజ క్రమంలో జరిగిపోయినట్లు బీథోవెన్ చిత్రీకరించాడు. ఈ లయ చిత్రణను అతడు 1802లో హైలిగెన్ స్టాట్‌కు వెళ్ళినప్పుడు రూపొందించాడు.

1823లో అదే జనపదానికి మళ్లీ వెళ్లాడు. అతడి స్నేహితుడు షిండ్లర్ కూడా వెంటే ఉన్నాడు. ఇద్దరూ అడవిలో తిరగడానికి వెళ్లారు. ''సూర్యుడు స్ఫుటంగా ప్రకాశిస్తున్నాడు. చెట్లు వసంత శోభను ధరించి ఉన్నాయి. బీథోవెన్ అక్కడా అక్కడా ఆగి, మనసారా గాలిపీల్చి, ఆ శోభను తిలకిస్తూ కనుచూపుమేర వరకూ తనివితీరా చూస్తూ గడపసాగాడు. కొంతసేపు గడిచినాక ఒకచోట ఒక చెట్టు నానుకుని, ఆ వాగు ప్రక్కన కూర్చుని రకరకాల పక్షుల కూతలను మారు కూతలను అనుసరించి ''లయ గోపావని''ని కూర్చాను అని బీథోవెన్ చెప్పాడు. అతడు దానిని కూర్చింది 1802లో. ఇప్పుడు పక్షుల కూతలను వినలేడు గదా'' అని షిండ్లర్ వ్రాశాడు.

షిండ్లర్ వివరణలే ఇంకా చెప్పుకుందాం. ''బీథోవెన్ చేసిన మరొక కృతి పియానో స్వరమేళ (పియానో సోనేటా) రెండో భాగాన్ని గురించి ప్రముఖ సమీక్షకుడు ఎడ్విన్ ఫిషర్ ఏమన్నాడో వినండి. పాతకాలపు తోట మధ్య గొణుగుతూ ఉండే ఫౌంటేన్ సరసన ఉన్న పాతకాలపు ఇల్లు చూశారా? అకస్మాత్తుగా ఆ ఇంటి కిటికీలు తెరుస్తే వెలుగు, గాలి అప్పటి వరకూ లోకం పట్టించుకోని చోటులోకి అమాంతం ప్రవేశిస్తాయి. లోకం పట్టించుకోలేని ఆ చోటులో వెలిసిపోయిన తివాచీలు, పాతబడిన ఆసన సామగ్రి, చెల్లాచెదురుగా పడివున్న గులాబి రెక్కలు, వాటన్నిటి పాత వాసన! ఈ స్వరమేళ వింటుంటే ఇటువంటి విస్మృత గృహ వాతావరణం ప్రాణం పోసుకుని సాక్షాత్కరిస్తుంది.''

(సోనేటాలో మన కృతులలో వలెనే రాగ వరస, రాగ ప్రస్తారం, నెరవలు అన్నీ ఉంటాయి.)

బీథోవెన్ కృతులలో పాత, కొత్త అన్నీ స్వర స్థాయి చేరుకుంటాయి. అతడు కూర్చిన సోనేటా (స్వరమేళ)లు, సింఫనీ (లయ మేళ)లు, కాన్‌సర్టో (వాద్య విన్యాసం)లు, వివిధ బృందగాన కృతులు, విన్యాసాలు, వర్ణాలలాంటి ఉపోద్ఘాత స్వర విన్యాసాలు ఎన్నో. అవన్నీ అతడి మానసిక స్థితికి దర్పణాలు; శ్రోతల మానసిక స్థితిని తీర్చిదిద్దే స్వరశక్తులు; శ్రోతల హృదయాలలోకి దూసుకుపోయే స్వరశరాలు. అదీ బీథోవెన్ గొప్పతనానికి ఆధారం. అదీ అతడి రహస్యం.

నెపోలియన్ అంటే బీథోవెన్‌కు ఇష్టం. అతడి పేరు ప్రవేశికలో చేర్చి ఇరోయ్‌కా సింఫనీ సమకూర్చాడు. 1803లో తీరా నెపోలియన్ తనే చక్రవర్తినని ప్రకటించుకున్నాడని విని, బీథోవెన్‌కు కోపం వచ్చింది. ప్రవేశికను చించి పారేశాడు. ''ఇతడూ సామాన్యుడి లాగానే

ప్రవర్తించాడు. ఇంకేముంది! తన ఆశలు తీర్చుకొనడానికి క్రూరుడై పోతాడు'' అని అతడు నెపోలియన్ పైన కోపం ప్రకటించుకున్నాడు. ఏమైనా బీథోవెన్ చాలా ప్రియంగా సంభావించు కున్న లయమేళలలో ''ఇరోయ్‌కా'' ప్రధానమైనది.

నెపోలియన్ పట్ల బీథోవెన్ అయిష్టం చాలా దూరం పోయింది. 1805లో జెకొస్లొవాకియాలో ఉన్నాడు బీథోవెన్. అక్కడికి ఫ్రెంచి సైన్యం వచ్చింది. ఆయన ఆతిథేయుడు (ఒక రాజకుమారుడు) సైనికాధికారులను సంతుష్టులను చేయాలని, బీథోవెన్‌కు కచేరీ చేయమన్నాడు. అంతే బీథోవెన్ ఇక కానరాలేదు. ఐపు లేకుండా పారిపోయాడు. ఆతిథేయునికి మాత్రం ఒక ఉత్తరం వ్రాసిపెట్టి మరీ పారిపోయాడు బీథోవెన్. శత్రుపక్షానికి వంతపాడే ఘటం కాదు బీథోవెన్. అట్లా పారిపోవడంలో అతడి స్వరమేళ వ్రాత ప్రతి ఒకటి తడిసింది అతడికి జలుబు పట్టింది. అతడి చెముడు మరీ గట్టిపడింది. చాలా బాధపడ్డాడు.

తీరా నెపోలియన్ సోదరుడు జెరోమీతో మాత్రం అనుబంధం తెగలేదు. అతడే తర్వాత తర్వాత చాలా తోడ్పడ్డాడు.

అన్యాయాలు, అక్రమాలు అంటే అతడికి జుగుప్స. అదే వైఖరి ఒక సంగీత నాటకం (ఫిడెలియో) లో, కోరల్ సింఫనీలో స్పష్టం చేసాడు. అతడి ఊహా వికాసం దొడ్డది. జ్యోత్స్న స్వరమేళ (సొనేటా), అట్లాగే అనేక ఇతర కృతులు అతడికి గల స్వర విన్యాస భావుకతను విదితం చేస్తున్నాయి. కొన్ని లయ విన్యాసాలు విలంబంలో నడిపాడు. అదొక ప్రత్యేక సొంపుగా తట్టకమానదు.

సంగీత లోలుడు. నిజమే ప్రేమ కలాపాలలోనూ పడ్డాడు. తీరా అవివాహితుడు గానే ఉండిపోయాడు. అన్నీ ఫలించని ప్రేమ కలాపాలే. పెళ్ళి చేసుకుందామని ఎన్ని పర్యాయాలు ఉవ్విళ్లూరినాడో! జులియెట్టా అనే ఆమెతో, జాబ్సియారి అనే జమీందారు బిడ్డతో అతడికి పెళ్ళి అయినంత పనిఅయింది. అంతే ఆమె పైన కూర్చినదే ''జ్యోత్స్న మేళ''!

చాలామంది యువతులు అతడిని ప్రేమించారు. చూపులకు బాగానే ఉన్న మనిషి కదా. పైగా ప్రతిభావంతుడు. కానీ అసాధారణ వ్యక్తి! సాధారణ వ్యక్తుల ఊహకు అందని, సరిపడని వ్యక్తి. దీనికి తోడు చెముడు. ఎవతె అతడితో ఉండి మనగలుగుతుంది? అతడికీ ఈ వాస్తవం తెలుసును. విధిని వశం చేసుకుని బతుకుతున్నా ''భగవంతుని సృష్టిలో చాలా సుఖహీనుడు''. అతడు ఒక విధంగా పసివాడు. తల్లిలాగా చూసుకునే ప్రియురాలు అవసరం. అతడి స్నేహితులు అతడి పాత దుస్తులు అతడికి తెలియకుండా తొలగించి వాటి స్థానే కొత్త దుస్తులు ఉంచి వెళ్లేవారు. అతడు ఇదంతా గ్రహించే స్థితిలో ఉండడు.

కానీ అతడిది విశిష్ట రూపం. చిత్రకారులకు ఆసక్తికరమైన నమూనా! అతడి చిత్రాన్ని చాలా మంది చిత్రకారులు వేశారు. చిత్రం వేస్తుంటే సరిగా కూర్చోడు. లేచి పోతాడు. భావోద్వేగి కదా. అసలు అతడితో పరిచయం చేసుకోవడం చిక్కు. ఆ పైన చెప్పిన మాట

వినిపించడం కష్టం. కూర్చోపెట్టడం అసాధ్యం. చెప్పినట్లు కూర్చోడు. ఐదు నిముషాలు స్థిమితంగా కూర్చుంటే గొప్ప. ఆ పైన లేస్తాడు. అక్కడ పియానో గానీ మరే వాద్యంగానీ ఉంటే అక్కడికి పోతాడు. చాలామంది చిత్రకారులు అతడికి చెప్పాచెయ్యకుండగానే అతడి ప్రతికృతి చిత్రాలు వేశారు. స్నేహితులలో కూర్చుని ఉన్నప్పుడో, ఏ హోటల్‌లోనో కూర్చుని ఉన్నప్పుడో చిత్రం వేసేవారు.

అట్లా అని అతడు వాళ్లని చూడడని కాదు. ''నాకు చెప్పకుండా నా చిత్రాలు రచించవద్దు. నా ముఖం నాకు ఏవగింపు కల్గించేటట్లు చేయవద్దు'' అని ఒక పర్యాయం పత్రికా ప్రకటన చేశాడు.

అయినా చిత్రరచనలు ఆగలేదు. అతడు అందగాడు కాకపోవచ్చు గానీ, అతడి తీరు తెన్నులు స్పష్టంగా ఉండేవి. సొంపులు తీర్చుకునే వ్యక్తికాదు. దాదాపు ఆటవికుని వలే స్వస్వరూపం పట్ల నిర్లక్ష్యం. కళ్లు మెరిసిపోతూ ఉండేవి. జుట్టును ఏనాడూ సరిగా దువ్వెనతో గానీ, కత్తెరతో గానీ సంస్కరించినట్లుండేది కాదు. అది ముఖం మీంచి దిగివస్తున్నట్లుండేది. ఆ జుట్టు తీరు పూర్వపు విగ్రహాలపైన ఆచ్ఛాదించే పాము పడగల లాగా ఉండేది.

అతడి ''ఐదవ లయ విన్యాసం''లో పేర్కొన్నట్లు అతడి వాలకం సూర్యుని వంక చూసే గరుడుని వలే ఉండేది. ఒంటి కంటి రక్కసి వలే! ''గేయకారులలో కల్లా ఓజస్సు కల వ్యక్తి'' అని రోమేరోలా వర్ణించాడు. ''అతడిలో ప్రతి గుణమూ కొంత అతిశయించే ఉంటుంది'' అని ఆయన భావన. అతడి లాంటి వ్యక్తి సకృతుగా పుట్టాడు.

జర్మన్ మహాకవి గెతే ''ఇటువంటి సంపూర్ణ తీవ్ర ఓజోభరితుని నేను మున్నెన్నడూ చూడలేదు. అతడు ఇతరులకు ఎంత విచిత్రంగా కానవస్తాడో ఊహించుకోగలను'' అన్నాడు.

బీథోవెన్‌కు ఏదో స్వంత పద్ధతిలో దైవం పట్ల విశ్వాసం ఉండేది. అతడి కళ్లు చూస్తే అతడు ధ్యానంలో ఉన్నట్లు అనుకొనక తప్పదు. చిన్నకళ్లే పైకి చూసేటప్పుడు విశాలమయ్యేవి. పైకి ఎంతో సేపు తదేక దీక్షతో చూసేవాడు దర్శనం చేసుకున్నట్లు.

ఏది చేసినా అదే నిష్ఠ. తీవ్రతతో చేసేవాడు. ఒక పర్యాయం ఏదో ఒక కృతిని రూపొందించుకుంటున్నాడు. ఒంటరిగా ఒక గదిలో ఉన్నాడు. సమీపంలో నౌకర్లు, చాకర్లు లేకుండా చేసుకుని, తిండి కూడా మానివేసి పాడుతూ, కేకలు పెడ్తూ, పాదాలతో తాడనం చేస్తూ ఉన్మత్తుని వలే ప్రవర్తించసాగాడు. అట్లా కొన్న దినాలు గడిచినాయి. ఆపైన చూడగా అతడేదో ''యశో వామృత్యుర్వా'' దీక్షతో యుద్ధం జరిపినట్లు కన్పడ్డాడు.

''నా పైన మానవాళి, దేవుడు, ప్రకృతి మోపిన బాధ్యతను నిర్వర్తించడమే నా విధి'' అని అతడే వ్రాసి పెట్టుకున్నాడు.

ఇంకా ఉంది అతడి జీవితయాత్ర లక్ష్యం...

ఆ ఒక్కడు అతడే - అతడి వలననే వీటన్నిటి ఉనికి; అతడికి అతడే చెందుతాడు.''

''ఉన్నదంతా నేనే; ఉన్నది, ఉంటున్నది, ఉండేది నేనే. నన్ను కప్పిన తెరను ఏ మనిషి తొలగించలేదు.

  

# రసస్వరూపం

- డా. భీమసేన్ 'నిర్మల్'

మన దేశంలో మొట్టమొదట 'రస' శబ్దాన్ని వాడింది భరతముని. ఆయన తన 'నాట్యశాస్త్రం'లో 'రసం' గురించి ఈ క్రింది సూత్రాన్ని మనకందించారు.

'విభావానుభావ వ్యభిచారీ సంయోగ్రదస నిష్పత్తిః'

ఇది రస స్వరూపాన్ని నిర్వచించదు, రస నిష్పత్తి (ఉత్పత్తి) ని గురించి చెబుతుంది. అయితే మనదేశంలో జరిగిన, జరుగుతున్న రస వివేచనకు ఈ సూత్రమే ఆధారభూత మయింది.

భరతుడు అనేక రకములయిన వ్యంజనాలు, తినుబండారాల సంయోగంతో, భోజ్యరసం ఉత్పన్నమయినట్లు, షడ్రసాలు తయారయినట్లు, వివిధ భావాలతో కూడిన స్థాయి భావం రసరూపాన్ని పొందుతుందని చెప్పాడు. ఈ రసం ఆస్వాద్యం. నానా రకాలయిన వ్యంజనాలతో కూడుకున్న ఆహారాన్ని భుజిస్తూ, మనం ఆనందించి నట్లే, ప్రసన్న చిత్తుడయిన ప్రేక్షకుడు (పాఠకుడు కూడా) వివిధ భావాల అభినయం ద్వారా, వర్ణనల ద్వారా అభివ్యక్తమయిన స్థాయి భావాలను ఆస్వాదించి ఆనందాన్ని పొందుతాడు. అంటే రసనిష్పత్తి మానసికానందానికి కారణభూతం స్థాయిభావం. అభినవగుప్తుడు చెప్పినట్లు అన్నం రసం కాదు. కాని రసానికి ఆధారం. వ్యంజనాదు లతో కూడి అది 'రసం'గా మారిపోతుంది. ఉదాహరణకు రతి అనే స్థాయి భావం తన మూల రూపంలో శృంగారరసం కాదు. కాని అది విభావ, అనుభావాలతోను, వ్యభిచారీ భావాలతోను సంబద్ధమయి, ప్రస్తుతీకరించబడినపుడు శృంగార రసరూ పాన్ని పొందుతుంది. అంటే ఆహ్లాదాన్ని కలిగిస్తుంది. భావ మూలకమయిన కావ్య సౌందర్యం యొక్క అనుభూతియే (ఆనందమే) 'రసం' అన్న మాట.

మూలంలో వనస్పతుల సారభూతమయిన ద్రవపదార్థపరంగా వాడబడిన 'రస' శబ్దానికి 'ఆస్వాదం' అనే అర్థం ఏర్పడింది. సోమరసానికి కల బహుళ ప్రచారంతో రస శబ్దానికి గల అర్థాలలో 'ఆనందం, మాదకత, తన్మయత్వం, చమత్కారం' మొదలయినవి కూడా కలిసాయి. ఆ తరవాత 'వాణీ చమత్కార' పరంగా రసశబ్దం వాడుకలోకి వచ్చింది. 'వాణీరసం' అన్నా 'వాగ్రసం' అన్నా, కావ్య రసానికి భిన్నమ యింది కాదు. సూక్ష్మతరమయిన ఆత్మానందానికి, బ్రహ్మానందానికి పర్యాయంగా కూడా రసశబ్దం వాడబడింది. ఏతావాతా 'రస' శబ్దానికి అర్థం మానసికోల్లాసం, ఆహ్లాదం అని చెప్పుకోవచ్చు.

---

సాహిత్యదర్పణకారుడయిన విశ్వనాథుడు రస స్వరూపానికి చెందిన వివేచనల సారాంశాన్ని ఈ క్రింది శ్లోకంలో పొందుపరిచాడు.

'సత్త్వోద్రేకాదఖండ స్వప్రకాశానంద చిన్మయః
వేద్యాంతర స్పర్శశూన్యో బ్రహ్మాస్వాద సహోదరః

లోకోత్తర చమత్కార ప్రాణః కైశ్చిత్ప్ర మాతృభిః
స్వాకార పద భిన్నత్వేనాయ మాస్వాద్యతే రసః॥'

(చిత్తంలో సత్త్వోద్రేకం కలిగినదశలో విశిష్ట సంస్కారాలతో కూడుకున్న సహృదయుడు అఖండ స్వప్రకాశానందమూ చిన్మయమూ, ఇతరాలయిన అన్నిరకాల జ్ఞానాలచేత వినిర్ముక్తమూ బ్రహ్మాస్వాద సహోదరమూ, లోకోత్తర చమత్కారప్రాణమూ అయిన రసాన్ని నిజస్వరూపాభిన్నంగా ఆహ్వాదిస్తాడు)

ఈ శ్లోక తాత్పర్యాన్ని ఈ క్రింది విధంగా వివరించవచ్చు.

1. రసం ఆస్వాదనకు విషయం. కాని నిజ స్వరూప + అభిన్న రూపంలో అంటే రసం ఆస్వాదాభిన్నమయినది. రసం ఆస్వాద రూపం.

2. సత్త్వగుణం ఉద్రేకం చెందినపుడు అది ఆవిర్భవిస్తుంది.

3. అది అఖండం.

4. అన్య జ్ఞానాలతో రహితమయినది.

5. స్వప్రకాశానందం.

6. చిన్మయం.

7. లోకోత్తర చమత్కార మయం.

8. బ్రహ్మానంద సహోదరం అంటే బ్రహ్మాస్వాదానికి చాలా దగ్గర అయినటువంటిది.

జగన్నాథ పండితుడు లౌకికసుఖం, బ్రహ్మానందం, కావ్యానందం అని ఆనందాన్ని మూడు రకాలుగా వింగడించి, కావ్యానందానికి మిగతా ఆనందాలకి భేదం ఉందని చెప్పాడు.

అనగా రసం కావ్యాస్వాదం. ఈ ఆస్వాదం ఆనందమయం. అంటే రసం ఒక రకమయిన ఆనంద చైతన్యం. శబ్దార్థాల ద్వారా, విశుద్ధ భావ భూమికలో, ఆత్మ చైతన్య (ఆనందమయ) ఆస్వాదమే రసం.

నానా విధాలయిన వ్యంజనాలతో కూడిన **అన్నం భుజిస్తూ,** ప్రసన్న చిత్తుడయిన వ్యక్తి రసాలను ఆస్వాదించి, ఆనందాన్ని అనుభవించినట్లుగా, ప్రసన్న చిత్తుడయిన ప్రేక్షకుడు (ప్రాచీన కాలం రసచర్చ నాట్య సంబంధంగా ఎక్కువగా జరిగింది) పాఠకుడు వివిధ భావాలు, అభినయాల ద్వారా వ్యంజితమయిన (ప్రదర్శించబడిన, అభివ్యక్తమయిన) స్థాయి భావాన్ని ఆస్వాదించి, ఆనందాన్ని పొందుతాడు. అనగా నాటకాన్ని చూడడం వల్ల, కావ్యాదులను చదవడం వల్ల కలిగే ఆనందమే 'రసం' అని భావం.

అభినవగుప్తుడు అత్యంత ఆహ్లాదాత్మకమయిన 'చర్వణ' (నెమరు వేయడం) రూపంలో సహృదయుడు స్థాయి భావిస్తాడు, ఆస్వాదిస్తాడు అని అన్నాడు.

'కావ్య ప్రకాశం' లో మమ్మటుడు.

'సకల ప్రయోజన మౌళిభూతం సమనంతరమేవ రసాస్వాదన సముద్భూతం విగలిత వేద్యాంతర మానందమ్' అని అన్నాడు. ఆయన రసాన్ని సకల ప్రయోజనాలకు మౌళిభూతం గాను, రసాస్వాదాన్ని ఆనంద రూపంగాను పరిగణించాడు.

సంస్కృతంలో కావ్యశాస్త్ర గ్రంథాలు రచించిన ఆచార్యులందరూ (దాదాపుగా అందరూ) రసాన్ని ఆనంద రూపంగా పరిగణించారు. కావ్య పఠనం వలన సహృదయుడి హృదయ సాగరం ఉప్పొంగి పోతుంది. అప్పుడు సహృదయుడు తన్మయుడయి పోతాడు. ఆ తాదాత్మ్యంలో కలిగే ఆనందమే 'రసం' అని తాత్పర్యం.

పాశ్చాత్య కావ్యశాస్త్రంలో ఇలాంటి రసచర్చ మనకు కనిపించదు. కాని పశ్చిమ దేశాల్లో కూడా కావ్యాస్వాదాన్ని ఆనంద రూపంగానే భావించారు. ప్లేటో ఆనందాన్ని రెండు రకాలుగా విభజించాడు. ఒకటి భౌతికానందం (లౌకిక ఆనందమని మనవాళ్ళు అన్నారు) రెండోది విశుద్ధ ఆనందం. ఇదే కావ్యానందం, బ్రహ్మానంద సహోదరం బ్రహ్మానందంతో సమానమయినది.

అరిస్టోటిలు కూడా కావ్యాస్వాద సందర్భంలో Pleasure అనే మాటను చాలాసార్లు వాడాడు.

ఆ తరవాత పాశ్చాత్య కావ్య శాస్త్రంలో ప్రముఖుడయిన లోంజాయినస్ ఆత్మోల్లాసమే కావ్యాస్వాద లక్షణమని అన్నాడు.

ఈ ముగ్గురి తరవాత కాలానికి చెందిన లక్షణవేత్తలూ, కావ్యవిమర్శకులూ కావ్యాస్వాదాన్ని ఆహ్లాద రూపంగానే పరిగణించారు. విక్టర్ హ్యూగో, కాల్డ్‌వెల్, వర్డ్స్‌వర్త్, షెల్లీ మొదలయిన వారంతా కావ్యాస్వాదాన్ని ఆహ్లాద రూపంగానే నిరూపించారు.

ఈ విధంగా విశ్లేషించి చూస్తే, ప్రాచ్య-పాశ్చాత్య కావ్య శాస్త్ర గ్రంథాలలలో కావ్యాస్వాదం ఆనంద రూపమేనని అనడంలో ఎటువంటి సందేహమూ లేదు. అయితే భారతీయ కావ్యశాస్త్రంవలె, పాశ్చాత్య కావ్యశాస్త్రంలో కావ్యాస్వాద స్వరూప విశ్లేషణపట్ల అంతగా పట్టుదల లేదు. అందుచేత వారు చేసిన విశ్లేషణ అంత వ్యవస్థితంగానూ లేదు. అంత సూక్ష్మ-గంభీరంగానూ లేదు. కాని కావ్యం ఆనంద స్వరూపం అనడంలో ఎటువంటి విప్రతిపత్తి లేదు.

(ఆచార్య నగేంద్రగారి 'రస సిద్ధాంత' గ్రంథం ఆధారంగా)

(Gorbachov wanted) to marry a hedgehog and a grass snake - Communism and a market economy, public property and private property ownership, the multiparty system and the Communist party with its monopoly on power.... But these things are imcompatible. - Mr Boris Yeltsin in an interview to Newsweek.

★ ★ ★ ★

The only danger is from the streets... if discontented people take to the streets, and political prostitutes and speculators urge them on. - Mr Mikhail Gorbachov.

★ ★ ★

What Hitler couldn't do, what imperialist intervention couldn't do in the early years of the October Revolution of liquidate the Soviet Union, human error has done. - Mr Fidel Castro.

★ ★ ★

# ఎవరీ మధురవాణి?

## పరిచయం

నేటి యువతరం అనగా కాలేజీలు, యూనివర్సిటీస్‌లోని విద్యార్థుల నుండి మరెంతో మంది సాంకేతిక విద్యనభ్యసిస్తున్న, ఇంజనీర్లు, డాక్టర్లు, అనేక వృత్తుల వ్యాపకాలవారు జాబులు వ్రాస్తూ ఎవరీ మధురవాణి? యీమె పూర్వాపరాలు ఏమిటి? యింతమంది మహామహులను చమత్కారంగా, తెలివిగా నిశితంగా ఇంటర్వ్యూ చెయ్యటం ఆశ్చర్యాన్ని, ఆమె అహంభావాన్ని చాటుతూ ప్రదర్శిస్తూంది అని జాబులు వ్రాస్తున్నారు. మమ్మల్ని ఆశ్చర్యచకితులను చేస్తున్నారు.

షుమారు 90 సంవత్సరాల క్రితం గురజాడవారు వ్రాసిన కన్యాశుల్కం అనే నాటకంలోని ముఖ్యపాత్ర. మధురవాణి లేని కన్యాశుల్కం, సీత లేని రామాయణంలా వుంటుంది. ప్రస్తుతం యీమె పురాణం వారి చెంతనచేరి కొత్తగా ప్రశ్నించటం నేర్చుకుంది. మృచ్ఛకటికంలోని వసంతసేన తన అప్పగారంటుంది. కొంతమంది పాఠకుల వుపయోగార్థం శ్రీ సోమయాజుల వెంకట రామమూర్తిగారిచే (1940 భారతి) విశ్లేషణాత్మకంగా వ్రాసిన, నేటి తరంవారు తప్పక చదవవలసిన యీ క్రిందివ్యాసాన్ని (భారతి సౌజన్యంతో) ప్రచురించుచున్నాము.

—సంపాదకుడు

ఆమె వేశ్య. విజయనగరం కాపురం. సంగీతంలోను, సాహిత్యంలోను ఆరితేరి, వృత్తిలో అందె వేసిన చేయి. సంస్కృతం నాటకాంతం వరకు చదివినట్టుంది. ''మృచ్ఛకటిక'' లోని ''వసంతసేన'' జీవితాన్ని బాగా జీర్ణించుకుంది. గిరీశం దగ్గర ఇంగ్లీషు నేర్చుకుంది. కొన్నాళ్లు అతని ప్రాపకంలో కూడా వుండేది. మరీ కొన్నాళ్ళకు రామప్పంతులు మాయల్లో పడి రామచంద్రపురం చేరుకుంది-అటు గిరీశం కృష్ణారాయపురం జేరుకున్నట్టు. పట్నవాసంలో మెలిగిన వ్యక్తి కనుక మొదట్లో ఆమెకేమీ తోచదు ఆ పల్లెటూరిలో. తన సంగీత విద్య, తన తెలివితేటలూ రామచంద్రపురంలో అడవిన కాచిన వెన్నెల వలె వృథా కదా అని చింతిస్తున్న సమయానికి ఆమెకు కరటకశాస్త్రి ధర్మమా అని- ''మాయసుబ్బి'' (కరటకశాస్త్రి శిష్యుడు మహేశం యొక్క కన్నెపిల్ల వేషం) యొక్క పెళ్ళి అనే ఘట్టానికి సూత్రధారణ సంఘటిస్తుంది. తీక్షణమైన తన బుద్ధిని యావత్తు వినియోగించడానికి తగినట్టి అపూర్వమైన ఘట్టం అది. ఒకానొక కుర్రవాణ్ణి-ఆడ వేషంలో-ఒక వృద్ధునికిచ్చి-నిజంగా వివాహం చెయ్యడం-తరువాత ఆ రహస్యం ఎవరికీ తెలియకుండా దాచడం, తుదకు తన ఇంటి యజమాని రామప్పంతులుకు కూడా తెలియకుండా-మహేశం ఆడవేషంలో అర్ధరాత్రప్పుడు తన ఇంటికి పారిపోయి వచ్చినపుడు ఆడవేషం విప్పించేసి మహేశం చేత దాసరి వేషం వేయించి కొత్త అగ్రహారానికి-కరటకశాస్త్రి ఉన్న తావుకు- క్షేమంగా పంపించడం. ఇంత కష్టమైన పనిని, ఎవ్వరికీ, ఎలాంటి ఒడుదుడుకు రాకుండా కాపాడుకుంటూ సాధించడం సామాన్యమైన విషయం కాదు. తలచుకుంటే గుండె వడిగా కొట్టుకుంటుంది. నాటిరాత్రి సంఘటనలన్నీ! మధురవాణి వంటి మేధానిధికే చెల్లును ఆ అధ్వర్యము!

రామప్పంతులు ఆడాలోనున్న వేశ్య తానైనప్పటికి రామప్పంతులును భర్తలాగునే పూజిస్తుంది. ''నేనుండగా మీరెలా వెధవలౌతారు?''

''నా ప్రాణం కంటే ఎక్కువైన మిమ్మలను నే కాపాడుకోవటం ఎవరికో ఉపకారం?''

మొదలైన వాక్యాల్లో ఆమెకు రామప్పంతులు యెడల ఉన్న గౌరవం వ్యక్తమౌతుంది.

ఆఖరుకు కేసుల్లో తిరుగుతున్న రామప్పంతులు విశాఖపట్నంలోనే బస చేయవలసి వస్తుంది. మధురవాణి కూడా విశాఖపట్నం వస్తుంది. క్రమేణా ఆమె తన వృత్తియొక్క హీనత గుర్తెరుగుతుంది. స్త్రీ జీవితం సంపూర్ణత చెందడానికి ద్రవ్యంగాని, విట సంపత్తిగాని కారణాలు కాజాలవు అని తెలిసికుంటుంది. తన జీవితంలో పరిపూర్ణమైన స్వాతంత్ర్యము ఉన్నప్పటికీ అనురక్తితో కూడుకొన్న, నియమబద్ధమైన స్వేచ్ఛ గాని, ఆనందంగాని లేకపోయినవి కదా అని పరితపిస్తూంటుంది. ఈ పరితాపాన్ని గూర్చి చదివితే ఎంతటి వాళ్ళకైనా మనసు ద్రవించక మానదు.

మధురవాణి, బుద్ధి సూక్ష్మతకు పెట్టింది పేరు. కొంప అవతల మునిగిపోతుంటే మన కివతల ఆనందం! పైశాచికమైనది కాదు సుమండీ! మునిగిన కొంపలు మీదికి తేల్చే శక్తి తనకు ఉన్నదికదా అన్న ధీమాచేత! మచ్చుకు చూడండి:

కరటకశాస్త్రులు, ''నువ్వు విద్యా, సౌందర్యాలు రెండూ దోహదం చేసి పెంచుతున్నావు'' అని మామూలు పాడి ముక్కలతో పొగడుతూంటే మధురవాణి:

''అంతకన్న కాపు మనిషినై పుట్టి మొగుడి పొలంలో వంగ మొక్కలకూ, మిరప మొక్కలకూ దోహదం చేస్తే యావజ్జీవం కాపాడే తనన్న వాళ్లు వుందురేమో?'' అంటుంది. ఇప్పటినుండీ మధురవాణి జీవితంలోని మాధుర్యఝురి వ్యక్తంగా కనిపిస్తూ, విశాలంగా విస్తరించి, ప్రవహిస్తూంటుంది.

ఇంతవరకు ఆనందభైరవి లాగు ఆకాశాన్ని అంటుతూన్న ఆమె యొక్క జీవితగీతం, మలయమారుతం వలె భూమిమీద వీచి 'హాయి హాయి' అనిపిస్తూంటుంది. కనులు మిరుమిట్లు గొలిపే ఆమె జీవిత విద్యుద్దీపిక చల్లని మబ్బు కాంతిలోకి మారి, ప్రశాంతమైన చంద్రకాంతిని జ్ఞాపకం చేస్తూంటుంది. ఇప్పట్నుంచీ, మధురవాణి వాక్కులు దేవకన్య వాక్కులవలె శాంతరస పూరితములు. చదువరుల హృదయాలలో స్వార్థరాహిత్యాన్ని ఉదయింపజేసి, తేల్చి ఉన్నత స్థానం చెర్చి విడిచిపెట్టే శక్తి కలిగి వుంటాయి!

కరటకశాస్త్రి, స్వార్థం ఆలోచించుకుని, డిప్టీ కలెక్టరు దగ్గరికి వెళ్ళమని మధురవాణిని ప్రోత్సాహ పరుస్తాడు. అప్పుడామె ఖండితంగా ''వెళ్ళదలుచుకోలేదు. ఇటుపైన పూర్థకుక్కలనూ, సీమకుక్కలనూ దూరంగా వుంచడానికి ఆలోచిస్తున్నాను.'' అని వృత్తి నెత్తికట్టే తన ఉద్దేశాన్ని తెలుపుతుంది. కరటకశాస్త్రి ఇంకా లాచారీపడి, ''డిప్టీ కలెక్టరు హెడ్

కానిస్టేబుపాటి చేశాడు కాడా?'' అని మందలిస్తే కోపం వచ్చి, ''హెడ్డుని నా వెనుక నౌఖరులా తిప్పుకున్నాను కాని అధికం లేదే? ఆ నాలుగు రోజులూ అతడు సర్కారు కొలువు మాని నా కొలువు చేశాడు. అతడి సాయం లేకపోతే మీరు నా వూరి పొలిమేర దాటుదురా? ఈ దాసరి దాటునా? లోకమంతా ఏమి స్వప్రయోజనపరులూ?'' అని వెనువెంటనే,

''చిత్రగుప్తుడికి లంచం ఇవ్వగలరా? అతడి దగ్గరికి మధురవాణిని పంపి, చేసిన పాపాలన్నీ తుడుపు పెట్టించడానికి వీలుండదు కాబోలు!'' అంటూ కరటకశాస్త్రి నెత్తి వాయగొట్టుంద చీవాట్లతో —

ఇంత గంభీరంగా మాట్లాడుతున్నప్పటికీ నవ్వి, శిష్యుడు దాసరివేషం వేసుకుని పాడిన పాటను తిరిగి పాడమని, ఆ పాటలో కరటకశాస్త్రికి తిట్లహారతిచ్చి తిమ్మరం వొదల గొడ్తుంది.

ఇక తుదిరంగంలో మధురవాణి ఉన్నత భావాలతో మిన్నందుకుంటుంది. మాటల చమత్కృతిలో, గిరీశం కంటే పై మెట్టు నుంటుంది చూడండి –

(మధు) కొత్తమనిషి నటనవల్ల కొద్ది కాలమే లోకానికి కళ్లు కప్పవచ్చుగాని, నిడివిమీద బంగారాన్నీ, ఇత్తడినీ లోకం యేర్పేస్తుందండి. (గిరీశంతో) యేమంటారు?

అప్పుడు గిరీశానికి ఈ మాటలన్నీ శూలాలై హృదయంలో గుచ్చుకుని తహతహ పుట్టిస్తాయి. గిరీశం ఏమీ తోచక, 'పంతులుగారికి నిద్రాభంగమౌతుంది. మీరు వచ్చిన పనేదో' అంటూ మధురవాణిని వేగంగా అక్కడనుంచి పంపించేయడానికి ఒక వెర్రి ప్రయత్నం చెస్తాడు. గిరిశం ఓడిపోయాడు. మధురవాణి తన కూట్లో దుమ్ము కొడుతుందన్న భయం పూర్తిగా వుందతనికి. తప్పించుకునే ఉపాయం లేదు. అప్పుడు దీనత్వంగా మధురవాణి వైపు చూచి ''నా కొంప తియ్యకుమా, నా గుట్టు బయట పెట్టకుమా?'' అన్నట్టుగా అభినయం వల్ల ఆమెకు తెలిపి నిష్క్రమిస్తాడు.

అటుతరువాత సౌజన్యారావుకీ, ప్రచ్ఛన్నంగా వున్న మధురవాణికి జరిగిన సంభాషణ వినండి:

మధు: ''వేశ్యజాతి చెడ్డది కావచ్చు గాని తాము సెలవిచ్చినట్టు చెడ్డలో మంచి వుండకూడదా? మంచి ఎక్కడున్నా గ్రాహ్యం కదా అండి?''

— అని కొంతసేపటికి లుబ్ధావధాన్ల కేసులో గట్టి సహాయం చేయకలిగినది ఒక వేశ్య వున్నట్టుగా సౌజన్యారావుకు సూచావాచా తెలుపుతుంది. ''డబ్బిద్దామం''టాడు పంతులు. అపుడు మధురవాణి ''ఆ వేశ్య ద్రవ్యానికి సాధ్యురాలు కాదండి'' అని తన యొక్క ఉద్దేశం అతనికి శుశ్రూష చేసుకోవడమేనని తెలుపుతూ, ఆ కోరిక తన తలకు తగని వెర్రికోరిక అని కూడా అంటుంది.

— విచిత్రమైన మానసిక సంచలనము! ఊర్ధ్వానికి ప్రయాణం సాగిస్తూన్న దామె మనస్సు ఉన్నత భావాలతో నిండి. అప్పుడు సౌజన్యారావును ఒక పెద్ద సమస్య ఎదుర్కొంటుంది.

''ఏంటి నాచ్ వ్రతానికి భంగం కలుగచేసుకోడమా? లేక లుబ్ధావధాన్లమీది కూనీ కేసు తప్పించే అవకాశం కాస్తా వదులుకోవడమా?'' అని అటు వ్రతభంగం! ఇటు బ్రహ్మహత్య! ఏంచేస్తాడు పాపం! తటపటాయిస్తూ ''నేను మన్మథుణ్ణా నన్ను వలచింది?'' అని ప్రశ్నిస్తాడు. మధురవాణి ''మిక్కిలి మంచివారని కాబోలు!'' అని సమాధానం చెబుతుంది. ఎట్టి మృదూక్తులివి:

మధురవాణికి ఐహికవాంఛలందు అసహ్యత కలిగిందని స్పష్టము కదా, దీనివల్ల? — తాను బాహ్య సౌందర్యానికి గాని ధనానికి గాని ఆశించే దినాలు వెళ్ళిపోయి. కేవలం ఆంతరంగిక సుందరతను ఆస్వాదించే కాలం వచ్చేసిందని తేటతెల్లము కాదా? – పవిత్రమైన పరివర్తనము! మానవ జీవితంలో ఇంతకంటె పరమావధి ఏమి కావాలి? ఇంతకంటె మోక్షమేముంది? ఇదే జీవన్ముక్తి! ఇదే కట్టెతో కైలాసం! సానిదానికి సౌజన్యమేమిటనే దురభిమానంతో కొట్టుకపోతున్న సౌజన్యారావు, ''సానిదానికి మంచితో పని వుండదు. ఇదేదో ఎత్తై ఉండాలి'' అంటాడు కోపంగా. ఆ మాట మధురవాణి హృదయానికి బాకువలె గుచ్చుకుంటుంది; పాపం! అప్పుడు ''మృచ్ఛకటిక చదివిందేమోనండీ!'' అంటుంది అతి అమాయకంగా. మధురవాణికి వసంతసేన జీవితం ఒక ఆదర్శం. ఇద్దరూ వేశ్యలలో అపూర్వమైనవాళ్ళే! సౌజన్యారావు అప్పటికీ లొంగడు. ''వసంతసేన లాంటి మనిషి వెర్రి కవీశ్వరుల కల్పనలో వుండాలిగాని లోకంలో వుండదు'' అని త్రోసిపుచ్చుతూ, ''వేశ్య డబ్బేల్లకపోదు-ద్రవ్యం కోరమనండి'' అంటాడు అతి బింకంగా. అంతకంటె బింకంగా మధురవాణి, తనకు విధికృతం చేత (అనగా పుట్టుక చేత) వేశ్యాసంసర్గం తప్పింది కాదంటూ, పురుషవేషం విప్పేసి సహజమైన స్త్రీ వేషంతో కనిపిస్తుంది. సౌజన్యారావు అగ్గిరాముడయిపోతాడు. ఎవరో శత్రువులు తన్ను పరీక్షించడాని కీ విధంగా మధురవాణిని నిశీథియందు, తన పడకటింటికి పంపించి వుంటారని భావిస్తాడు. కోపోద్దీపితుడై, ''ఏమి దగా!'' అని పళ్లు కొరికితే, పాపం! మధురవాణి నిండు దుఃఖంతో, ''నిర్మలమైన అంతఃకరణతో వస్తిని, నిజము దేముడెరుగవలె'' అని పొంగివస్తూన్న దుఃఖాన్ని దిగమ్రింగి గుమ్మంలోకి వెళ్ళిపోతూంటే సౌజన్యారావు, ''నిలు నిలు - పాగా కోటూ మరచి పోయావు'' అంటాడు. అప్పుడు మధురవాణి, ''అంతేనా? మనసే మరచిపోయాను. కొదవేమిటి?'' అనడంలో తాను పూర్తిగా సౌజన్యారావుపై తన మనస్సు లగ్నంచేసి, వట్టి కళేబరంతో ఇంటికి పోతూన్నట్టున్నూ, ఇకపైని తన జీవితం శూన్యమైపోయిందని భావించినట్టూ, స్పష్టంగా తెలుస్తూంది కాదా?

ఇది చదివితే, యెవరి హృదయం చలించదు? వేశ్యల సమస్యను గూర్చి సౌజన్యారావుతో 'ఢీ' యని ఎదుర్కొని వాదిస్తుంది. ''దేవాలయములో మేము భగవంతుడ్ని చూడడమునకు పోవచ్చునుగదా? సత్పురుషులైన తమవంటివారి దర్శనమునకు నిరోధమా?'' అని ముదలకిస్తుంది. దానికేం జవాబు చెప్పలేడు సౌజన్యారావు, చెప్పడానికి చేతగాక! ఆశ్చర్యంగా మధురవాణిని నఖశిఖ పర్యంతం నిదానించి చూస్తుంటాడు. సంఘటనకి కల్గిన ఆశ్చర్యం కాదది - ఆమె సౌందర్యమునకు ముగ్ధుడయిపోయి, ''అట్టేసేపు నీవు నా యెదుటగానీ నిలిచివుంటే, నువ్వు ఏ తగువు తీరిస్తే ఆ తగువుకు ఒప్పుదల అవుతానేమో అని

భయమేస్తూంది'' అని ఆమె బాహ్య ఆంతరంగిక, సుందరతను శ్లాఘిస్తున్నాడు. మధురవాణి తుని తగువుగా ఒక ముద్దుతో సంతృప్తి పొందుతానంటుంది. సౌజన్యారావుకు ఈ పిచ్చి ధోరణేమీ అర్థంకాలేదు.

''ఏం వెర్రిమనిషి! నీకు ముద్దు కావాలి? - ఏం లాభం?'' అని అడుగుతాడు. ఆ ప్రశ్నకేం జవాబుంది? అందుకే మధురవాణి అతి అమాయకంగా, ''నాకు తెలియదు'' అని వూరుకుంటుంది. ఇనుము అయస్కాంతం దగ్గరికి పరుగెత్తినట్లు, నదులు సముద్రాన్ని చేరుకుని లీనమైపోయినట్లు - తన ఆత్మ సౌజన్యారావువైపు పరుగెత్తుతూందనే సూచన. ఇది లాలసకాదు, మోహముకాదు; శారీరక వాంఛ ఎంత మాత్రమూ కాదు; ఇది మంచిని ఆశ్రయిద్దామనే ప్రబల వాంఛతో నిండిన మనస్సుయొక్క ఆవేగము; సౌజన్యము నాస్వాదించటానికి అతిశయించిన తృష్ణ; నిరాధారంగావున్న తన జీవితానికి ఒక పట్టుగొమ్మకోసం వెదకులాడే స్త్రీలకు సహజమైనదగు ఒక బలమైన కోర్కె; సజ్జన సేవయందు తనకుగల గాఢమైన అనురక్తి. ఆలాగున ముద్దు కోరేసరికి సౌజన్యారావు, ''వెయ్యి రూపాయలకంటె ఒక ముద్దు ఎక్కువ విలువా?'' అని ఆశ్చర్యపడి 'సరే' అని ఒప్పుకొని కూనీకేసు విషయంలో నిజం ఏమిటో చెప్పమంటే మధురవాణి ''తెల్లబియ్యం పాటి మానికా! లుబ్ధావధాన్లు వివాహమాడిన పిల్ల నిజమైన ఆడపిల్ల కాదు'' అని పేనుకొని ముడిపడిపోయిన కథా సూత్రాలన్నిటినీ ఒక్క తృటిలో విప్పివడేస్తుంది. ఖరారు ప్రకారం సౌజన్యారావు మధురవాణిని ముద్దెట్టుకునేందుకు సిద్ధమౌతాడు. అతని పెదవులు తన చెక్కిలికి తగిలీ తగలకుండా వుంటూన్న సమయానికి ''ఆగండి'' అని ఒసికిలి తప్పించుకొంటూ ''చెడని వారిని చెడగొట్టడం తన మతం కాదని'' వాదిస్తుంది. ''అమ్మయ్య! బ్రతుకు జీవుడా!! కృతజ్ఞుణ్ణి'' అని స్వేచ్ఛగా ఊపిరి తీస్తాడు సౌజన్యారావు. ఆ దెబ్బతో ప్లీడరుగారికి మధురవాణి సౌశీల్యము బోధపడుతుంది. ఆమె జీవితంలో స్వార్థానికెచ్చటా తావులేదని తెలుసుకుంటాడు. ఆమెకు 'భగవద్గీత' ప్రతి నొకటి బహుమానంగా యిచ్చి, వ్రతభంగమని సంకోచింపక, ఆమెతో "Shake-hand" చేసి సగౌరవంగా సాగనంపుతాడు. దానిలోనే మనకు **తెలుస్తుంది మధురవాణి సామాన్యమైన వేశ్యకంటె - బ్రాహ్మణోత్తములకంటె-వెయ్యిరెట్లు ఎక్కువ విలువైందని అతడు తెలుసుకొన్నట్లు!**

మధురవాణి వేశ్య కావచ్చు - కొన్నాళ్ళు వేశ్యావృత్తి నవలంబించి యుండవచ్చు. కాని, ఆమె యొక్క సరళస్వభావం, నిర్మలమైన అంతఃకరణా, పరోపకారబుద్ధీ, నిస్వార్థతా, కొంపలు కూలదోసే గాలివానలో కూడ ముచ్చటగా నాట్యంచేసే విలక్షణ స్వభావమూ, తన చతురత చేత ఎంతటి ప్రళయాగ్నినైనా వారించేధీమా - ఆమె పెను ప్రళయంలో కూడా తాండవం చేస్తుంది ఆనందంతో! వీటి నన్నిటినీ మించిన అమాయకత్వం - ఓహో!

''మధురవాణి ఒక అపూర్వమైన సృష్టి! అప్పారాయా!'' అనిపిస్తూంటుంది ఎల్లప్పటికీ!



